# బీజ పరిరక్షకులం

నగ్నం చేసెయ్ మా నేలను
కాల్చి వేయ్ మా కలలను
మా పాటలపై యాసిడ్ చల్లు!
ఊచకోత కోయబడ్డ మా జనాల నెత్తురును
రంపపు పొట్టుతో కప్పి వేసెయ్!
ప్రకృతి సిద్ధమైన, దేశీయమైన
స్వేచ్ఛా రావాలన్నిటినీ
నీ టెక్నాలజీ కబంధ హస్తాలతో నులిమి వేసెయ్!
నాశనం చేయ్ .... ధ్వంసం చేయ్
మా కాళ్ళ క్రింద గడ్డినీ, మట్టినీ!
కూల గొట్టేయ్ / మా పూర్వీకులు నిర్మించిన
నగరాలనూ, గ్రామాలనూ,
చెట్లనూ, గృహాలనూ
గ్రంథాలనూ, చిత్రాలనూ,
సమానత్వాన్నీ, సామరస్యాన్నీ!
నీ బాంబులతో / లోయలన్నిటినీ చదును చేసెయ్!
నీ శాసనాలతో తుడిచి పెట్టేయ్
మా గతాన్నీ, మా సాహిత్యాన్నీ, మా అలంకార శాస్త్రాన్నీ!
అడవులను నరికి పారెయ్
భూమిని నగ్నం చేసెయ్
కీటకాలు గాని, పక్షులు గాని, పదాలు గాని
దాక్కోటానికి వీలు లేకుండా!
ఇంతకంటే పదిరెట్లు ధ్వంసం చేసినా
నీ నిరంకుశత్వానికి నేను జడిసిపోను
నిరాశోపహతుణ్ణి అసలే కాను!
ఎందుకంటే / నేను కాపాడుకున్నాను / ఒక విత్తనాన్ని
సజీవమైన, ఆరోగ్యకరమైన / బీజాన్ని!
దాన్ని మరల విత్తుతాను
నీ విధ్వంసాన్ని ధిక్కరిస్తూ / పునః సృష్టి చేస్తాను.

పాలస్తీనా కవితకు
ఆంగ్లానువాదం : శాంతి

తెలుగు అనువాదం :
కొత్తపల్లి రవిబాబు




సంపుటి 16 సంచిక 11

జూన్ 1993

రచనలు పంపవలసిన చిరునామా .

నిర్మలానంద,
వర్కింగ్ ఎడిటర్,
29-28-67, దాసరివారివీధి,
సూర్యారావుపేట,
విజయవాడ - 520 002.

**140**

ఏజంట్లు, చందాదారులు
వ్రాయవలసిన అడ్రస్,
ఇతర వివరాలకు :

**కొత్తపల్లి రవిబాబు,**
ప్రధాన కార్యదర్శి
జనసాహితి, నగరం-522 268
తెనాలి తాలూకా




ముఖచిత్ర కవిత :

గుప్పిళ్ళ పొత్తిళ్ళతో
సుక్షేత్రాలలో పొదువుకునే
మా బిడ్డల్ని....
విత్తనాల రతనాల్ని....
కబళించే కార్గెల్ డంకెల్
బంకెల్ .. గింకెల్
ఎవరైతేనేం....
దుక్కులు దున్నేటప్పుడు
నలిగే పిచ్చి మొక్కల్లా
నలిపి....నలిపి....నలిపి....
పారేస్తాం....ఏరేస్తాం....

ఉదయ్

కవరు రెండవ పేజీ

బీజ పరిరక్షకులు (కవిత)

అను : కొత్తపల్లి రవిబాబు

నాల్గవ కవరుపేజీలో :

విత్తనమెప్పుడూ విశ్రమించదు
(కవిత) — నారాయణ స్వామి

వెల : రూ. 5 సం॥ చందా రూ. 50
ప్రత్యేక సం॥ చందా రు. 100
(సం॥లో ప్రచురించిన పుస్తకాలతో)
డి. డి. లు మేనేజర్, ప్రజాసాహితి
విజయవాడ-2 పేరుతో పంపాలి

## ఈ సంచికలో....

## సంపాదకీయం

# ప్రజల నెత్తిమీద వేలాడుతున్న కత్తి - డంకెల్ ముసాయిదా...

ఇప్పటికే ప్రపంచ పోలీసుగా, ప్రపంచ గూండాగా పేరు ప్రఖ్యాతులు తెచ్చుకున్న అమెరికా - సరికొత్తగా ప్రపంచ మేధావిగా గుర్తింపు పొందాలని డంకెల్ ముసాయిదా ద్వారా విశ్వప్రయత్నం చేస్తోంది. 26 ఒప్పందాలు గల 450 పేజీల ఈ ముసాయిదాను గాట్ డైరక్టర్ జనరల్ డంకెల్ ఆ సంస్థ సభ్యదేశమైన 108 దేశాలకు 1991 డిశంబర్‌లో అందచేసాడు. ఈ ముసాయిదాను అంగీకరిస్తే 'బహుళ పక్ష వ్యాపార సంస్థ' (Multilatral Trade Organiration MTO) ఏర్పడుతుంది. ఏక పక్షంగా రూపొందబడిన 'బహుళ పక్ష వ్యాపార సంస్థ' తనకు సంక్రమించిన హక్కులతో వర్ధమాన దేశాలను పీల్చి పిప్పి చేస్తుంది. మనం తినాలన్నా, కొనాలన్నా ఈ సంస్థ అనుమతికి ప్రాధేయ పడాల్సిందే. మన హరిత సంస్కృతి యావత్తూ విదేశీ పెత్తం దారుల గుత్తాధి పత్యానికి బానిసగా మారుతుంది. శతాబ్దాల తరబడి మన రైతాంగం అభివృద్ధి చేసిన జన్యువులపై హక్కులన్నీ సామ్రాజ్య వాద దేశాల హక్కు భుక్తమౌతాయి.

ఈ ఒప్పందానికి వ్యతిరేకంగా భారత ప్రజానీకం వెల్లడించిన నిరసన వెల్లువ ఫలితంగా కేంద్రం విత్తనాల పేటెంట్‌కు సంబంధించిన దానిపై సంతకం చేయడం లేదని ప్రకటించింది.

1992 డిసెంబర్ 29 న బెంగుళూరులోని అమెరికన్ బహుళజాతి సంస్థ కార్గిల్ సీడ్స్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్ కార్యాలయంపై కర్నాటక రాజ్య రైతు సంఘం దాడి చేసింది. అనేక పట్టణాలలో వివిధ సంఘాలు డంకెల్ ముసాయిదాను ఎండగడుతూ సదస్సులు, ఊరేగింపులూ జరిపాయి.

ప్రపంచ వ్యాప్తంగా, ఫ్రాన్స్‌లో, జర్మనీలో, స్పెయిన్‌లో, ఇటలీలో, బెల్జియంలో, జపాన్‌లో, కొరియాలో, ఫిలిప్పైన్స్‌లో, దీనికివ్యతిరేకంగా ప్రదర్శనలు జరిగాయి. కేవలం జన్యు వనరులపై పేటెంట్ హక్కులను నిరాకరించడమేకాదు- ఔషధ రంగంలోనూ, ఇంకా ఇతర రంగాల్లోనూ బహుళజాతి కార్పొరేషన్లు ప్రవేశించకుండా నిరోధించాలి.

ఔషధ రంగానికి సంబంధించిన ఒప్పందంపై అంగీకరిస్తే మనదేశంలో మందుల ధరలు పదింతలు పెరుగుతాయి. పేద వారికి వైద్య సహాయం గగన

కొనసాగుతుంది రైల్వేరంగం, జీవితబీమా రంగం మొదలైన సేవారంగాలలో కూడా ఈ బహుళజాతి కార్పోరేషన్లు ప్రవేశించే ప్రమాదం డంకెల్ ముసాయిదాలో వుంది.

మన దేశాన్ని మరోసారి సామ్రాజ్యవాద దేశాల బానిసగా మార్చే డంకెల్ ముసాయిదాను మొత్తంగా తిరస్కరించాలి!

"మా గొంతులు నొక్కుతాయి ప్రభుత్వాలు
మమ్ములను మరింత దిగజారుస్తాయి ప్రభుత్వాలు
మేము గొంతెత్తి తీరాలి!
ఆ యుద్ధమే గత్యంతరం!"

సంపాదకీయం 2 :

## రాయల సీమలో భూస్వామ్య సాయుధ ముఠాలకు వ్యతిరేకంగా సాగుతున్న ఉద్యమాన్ని బలపరచండి

**మహామహులు** ఒకప్పుడు రతనాలసీమగా పిలుపించుకున్న రాయలసీమ ఈనాడు రాళ్ళ సీమగా, కరువుసీమగా, బాంబులసీమగా పేరుపొందుతోంది. అక్కడ తాగు నీటికి, సాగునీటికేకాక బతుకు భద్రతకి, ప్రజాస్వామ్యానికి కరువొచ్చిపడింది. నీటి సౌకర్యం వుండే బంగరు పంటలు పండే నల్లరేగడి నేలలు, ఎర్రమట్టి భూములువున్న ప్రాంతమే అది. పారిశ్రామికంగా అభివృద్ధి చెందడానికి కావాల్సిన సున్నపురాయిగనులూ, రకరకాల నాపరాళ్ళ సంపదలూ అక్కడ వున్నాయి. కాని ప్రజల జీవితాల్ని బాగుచెయ్యాలనే తపనా, పట్టుదలా, హృదయమూగల నాయకత్వపు కరువు వల్ల రాయలసీమ మధ్యయుగాలనాటి పాలెగాళ్ళ ఉక్కు పిడికిళ్ళలోనే గిజగిజలాడవలసి వస్తోంది.

భారత దళారీ పాలకులూ, వారి రాజకీయ ప్రతినిధులూ ప్రజాస్వామ్యాన్ని ఒక జీవన విధానంగా గుర్తించలేదు. పంచాయితీ నుండి పార్లమెంటుదాకా, కుటుంబంలో స్త్రీ పురుషుల సంబంధాల నుండి దేశంలో జాతుల, భాషల, ప్రాంతాల సమస్యదాకా ప్రజాస్వామిక పద్ధతిన అమలు పరచవచ్చునని వారి ఊహకే అందని విషయం. పతన సాంస్కృతిక విలువలతో యథాతథస్థితిని, ఫ్యూడల్ తనాన్ని కాపాడుటయే వారి విధానం.

అందుకే రాయలసీమ లాంటి ప్రాంతాలు బాంబుల మోతల మధ్య, కటకొడవళ్ళ రాక్షస కరాళ నృత్యంలో విల విల లాడిపోతున్నాయి. మనిషిప్రాణం తీయటం అక్కడ మంచినీళ్ళ ప్రాయం. జడలు విప్పి నర్తించే ఫ్యాక్షన్ భూతాలు -పచ్చగా కళకళ లాడాల్సిన పల్లెల్ని నిత్యం భగ్గున మండే పగల, సెగల, రావణ కాష్టంగా

జరిగాయి. పాలనా యంత్రాంగంలో ముఖ్యంగా పోలీసు, రెవెన్యూ వర్గాల్లో నిజాయితీకి కరువు ప్రాదుర్భవించటంపై దుస్థితికి దోహదపడుతోంది.

ఒక్క కర్నూలు జిల్లాలో 2000 లైసెన్సుడు తుపాకులున్నాయి. అక్రమంగా ఇంకా ఎన్నో రెట్లుంటాయి. దాంతో హింస, రక్తపాతం నేరప్రవృత్తి రాయలసీమలో బాగా విస్తరించింది.

ఇటువంటి పరిస్థితులలో రాయలసీమ ప్రజల్ని అన్ని రంగాలలో, రూపాలలో అణచి వుంచుతున్న భూస్వామ్య సాయుధ ముఠాలకూ, అసంస్కృతికి వ్యతిరేకంగా అక్కడి ప్రజల్ని ఆందోళనలోకి తీసుకువచ్చే కృషి చేయటం అత్యంతావసరమైనది. ప్రజల్ని పీల్చి పిప్పి చేస్తున్న సాయుధ భూస్వామ్య ముఠాలను నిరాయుధం చేయటం మొదటి డిమాండుగా సాగుతున్న ఈ ఉద్యమాన్ని బలపరచటం 'ప్రజాస్వామ్యం'పై ఆసక్తిగల ప్రతి రచయితా, కళాకారుడూ, మేధావి మొదలైనవారి కనీస కర్తవ్యంగా 'ప్రజాసాహితి' భావిస్తోంది. సమస్త సాహితీ సాంస్కృతిక సంస్థల ద్వారా తమ బాధ్యతను నిర్వర్తించాలని మేధావి వర్గానికి మేము విజ్ఞప్తి చేస్తున్నాము. రాయలసీమలో ప్రారంభమైన భూస్వామ్య సాయుధ ముఠాల వ్యతిరేక ప్రజాస్వామిక వేదికకు మద్దతునిస్తున్నాం. ఈ సందర్భంగా వారు ప్రకటించిన కరపత్రాన్ని మా పత్రిక 'సంపాదకీయం'గా ప్రచురిస్తున్నాం - ★ ★ ★

రాయలసీమ ప్రాంతం రాష్ట్రంలోనే కాక దేశంలోనే వెనకబడిన ప్రాంతాలలో ఒకటిగా గుర్తించబడింది. మంచినీటి కోసం అనేక గ్రామాల ప్రజలు ఇప్పటికీ మైళ్ళకు మైళ్ళు దూరం నడిచి వెళ్ళవలసి వస్తున్నది. సాగునీరు లేక అనంతపురం జిల్లాలో పంట భూములు ఎడారులుగా మారుతున్నాయి. పారిశ్రామికంగా, విద్యాపరంగా రాయలసీమ ప్రాంతం పూర్తిగా వెనకబాటు తనంతో ఉంది. రాయలసీమ ప్రాంతం ఇంత వెనకబాటు తనంతో ఉంటే ఇక్కడి రాజకీయ నాయకులు, సంస్థలూ ప్రజల సమస్యల పరిష్కారానికై కృషి చేస్తారని అందరూ ఆశిస్తారు. పార్లమెంటులో, అసెంబ్లీలో నాయకులుగా ఉన్నవారు, ఈ ప్రాంత సమస్యలను ఆ వేదికలలో అందరి దృష్టికి తెచ్చి ప్రజల అభివృద్ధికై పాటుపడతారని ఎవరైనా ఆశిస్తారు. ఈ ప్రాంతం నుంచి మంత్రులైన వారు, ముఖ్యమంత్రులైన వారు, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలలో తమ స్థానాలను అధికారాలను ఈ ప్రాంత ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి వినియోగిస్తారని ఆశిస్తారు. కానీ "ఏరు దాటే వరకు ఓడ మల్లయ్య, ఏరు దాటాక బోడి మల్లయ్య" అన్న చందంగా ఎన్నికలు దగ్గరకు వచ్చినప్పుడో, లేదా తమకు పదవులు లభించనప్పుడో మాత్రమే ఈ పార్లమెంటరీ నాయకులకు ప్రజలు, సమస్యలు గుర్తుకొస్తాయి. ఇతర సమయాలలో వీరు "రణానికైనా సిద్ధమే, రాజీకైనా సిద్ధమే" అంటూ రంకెలు వేస్తూ తమ సాయుధ బలగాల

సహాయంతో ప్రత్యర్థులను దెబ్బ తీసేందుకు లేక ప్రజలను పీక్కు తినేందుకు ప్రయత్నిస్తున్నారు.

**రాయలసీమలో ప్రజలపై స్వైర విహారం చేస్తున్న భూస్వామ్య సాయుధ ముఠాలు**

కర్నూలు జిల్లాలోని అధ్యసిక ప్రాంతం, కడప జిల్లాలో, అనంతపురం జిల్లాలోని ఒక భాగంలో నేడు భూస్వామ్య సాయుధ ముఠాలు స్వైర విహారం చేస్తున్నాయి. ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కో ముఠా స్వంత సైన్యాలను ఏర్పరచుకొని మధ్య యుగాల నాటి పాలె గాళ్ళలాగా పరిపాలన సాగిస్తున్నారు. తమ, తమ ప్రాభావిత ప్రాంతాలలో వీరే శాసనకర్తలు, వీరే దండనాధీశులు, వీరే న్యాయమూర్తులు. శివుని ఆజ్ఞ లేనిదే చీమైనా కదలదు అన్న విధంగా వీరి అనుమతి లేకుండా, వీరి ఇష్టానికి వ్యతిరేకంగా ఎవరూ ఏమీ చేయకూడదు. పంచాయితీ ఎన్నికల నుండీ పార్లమెంటు ఎన్నికల వరకూ ప్రజలు ఎవరికి ఓటు వేయాలో వీరే నిర్ణయిస్తారు. ప్రజలు ఏ పార్టీలో ఉండాలో వీరే నిర్ణయిస్తారు. ప్రజలు ఏ ఉద్యమాలలో పాల్గొనాలో, ఏ ఉద్యమాలలో పాల్గొనకూడదో వీరే నిర్ణయిస్తారు.

ఒక ముఠా నాయకుడి రాజ్యంలో ప్రజలు ఎవరైనా సరే ఏ ఆస్తులు కొన్నా (ఉదా: ఇళ్ళు, స్థలాలు, పొలాలు), అమ్మినా, కొన్నవాడూ, అమ్మినవాడు ఆ ముఠా నాయకుడికి ఇంత భరణం చెల్లించాలి. నాపరాయి గనుల నుండి వెళ్ళే ప్రతిట్రాక్టరు లోడుకు 50 రూ॥లు, లారీ లోడుకు 150 రూ॥లు ముఠా నాయకుడికి విధిగా చెల్లించాలి. ఆ ముఠా నాయకుడు నివసించే వీధి గుండా ఏ వాహనం తిరగరాదు. మరొక ముఠా నాయకుడి రాజ్యంలో అతను ఏ వ్యాపారంలో చేయి దూరిస్తే ఆ వ్యాపారంలో అతనికి పోటీ అనేది ఉండకూడదు. సారా వ్యాపారమైనా, సినిమా వ్యాపారమైనా, బారైనా, కల్లు దుకాణాలైనా అతనికి పోటీ ఉండటానికి వీల్లేదు. పోటీదారుడనే వాడు ఎవరైనా ఉంటే వాడు కృష్ణానదిలో శవమై తేలుతాడు. కోర్టుల్లోనైనా క్రింది కోర్టు తీర్పు నచ్చకపోతే పై కోర్టుకు వెళ్ళవచ్చేమో గానీ ఈ ముఠానాయకుడి రాజ్యంలో అతను చెప్పిందే శాసనం, చేసించే నిర్ణయం. దానిపై అప్పీలు లేదు. మరొక ముఠా నాయకుడు తన పార్టీలో తప్ప వేరే పార్టీలో ఎవరైనా ఉంటే వారి కాళ్ళు, చేతులు నరికించడంలో ప్రసిద్ధుడు. ఇతడి రాజ్యంలో మరొక పార్టీ యొక్క కార్యకలాపాలు ఉండకూడదు. సింగిల్ విండో ఎన్నికలలో తన అభ్యర్థిగా పోటీగా నిలబడినందుకు కక్ష్య కట్టి, తన ప్రత్యర్థుల ఎన్నికల ఆఫీసులు తెరిచినందుకు ఏకంగా ఆఫీసు తెరిచినతన్ని చంపించిన ఘనమైన చరిత్ర వీరికుంది. మరొక ప్రాంతంలో ముఠా నాయకులు తనకు ఇష్టం వచ్చిన వారిని పిలిచి ఇళ్ళ చాకిరీ చేయమంటే చేయాలి వాడు ఇచ్చినంత తీసుకోవాలి. చివరకు రాత్రి అయితే ప్రజలు

రోడ్ల మీద తిరగడానికి కూడా భయపడే అప్రకటిత కర్ఫ్యూలను స్వచ్ఛందంగానే అమలు జరుపుతున్నారు. రాత్రి వేళ ఈ ముఠా నాయకుడి అనుచరులు రోడ్లపై వెళ్ళే వారి జేబుల్లో చేతులు పెట్టి దొరికినదంతా పట్టుకుపోతారు. వారి చేతుల్లోని బాంబులు, భుజాల మీద తుపాకులు చూసి నోరు తెరిచే శక్తి ఎవరికుంటుంది? ఒక కోట కాలువ నీరు పట్టుకోవాలంటే ముఠా నాయకుడికో లేక అతని తరపున ఆ గ్రామంలో పెత్తనం సాగిస్తున్న సామంతుడికో ఎకరానికి 100 రూ॥లో లేక 150 రూపాయలో చెల్లించాలి. వ్యవసాయ కూలీలు ముఠా నాయకుల, వారి అనుచర బృందాల పొలాల్లోనే ముందు పని చేయాలి. వారు ఇచ్చినంత కూలీనే తీసుకోవాలి. ముఠా నాయకులు వారి అనుచర బృందాలు స్త్రీలపై చేసే అత్యాచారాలకు లెక్కలేదు. ఇవి వెలుగులోకి రావు. ఒక నాయకుడి కొడుకు తన గ్రామంలోని మహిళలలో నచ్చిన వారిని తన ఇంట్లో వారం రోజులు ఉంచుకొని పంపితే మరొక ముఠా నాయకుడి అనుచరులు బహిరంగంగానే తనకు నచ్చిన వారి ఇండ్లలోకి దూరి మహిళలపై అత్యాచారాలు చేశారు దారిన పోయే వారిని జీపుల్లోకి ఎక్కించుకొని కొన్ని రోజులు ఉంచుకొని వదిలిపెట్టిన సంఘటనలనేకం. వీరి రాజ్యాలలో ఎంతటి పెత్తనం చెలాయిస్తున్నారంటే చివరకు తమ జీపులకు సైడు ఇవ్వలేదని లారీ డ్రైవర్‌ని కూడా కాల్చి చంపిన సంఘటనలున్నాయి. ఈ ముఠాలు ప్రజలపై సాగిస్తున్న దోపిడీ దౌర్జన్యాలకు అంతు లేకుండా ఉంది.

ఈ ముఠా నాయకులు తమ తమ ప్రాంతాలలో అన్ని ఆదాయ వనరులను కైవసం చేసుకొంటున్నారు. వీరే భూస్వాములు, వీరే సారా వ్యాపారులు, వీరే నాపరాయి గనుల యజమానులు, వీరే సినిమాహాలు ఓనర్లు, వీరే బీరు, బ్రాంది, బారు షాపుల యజమానులు. దొంగ కలప వ్యాపారం వీరిదే. సివిల్ కాంట్రాక్టులూ వీరివే. ఒకటేమిటి, పంచాయితీల నిధుల నుండి, ప్రభుత్వ సబ్సిడీల నుండీ అన్నిటిలో వీరు వాటాలుంటాయి.

వీరి దుర్మార్గాలకు వ్యతిరేకంగా ఎవరూ గొంతెత్తకూడదు. వీరి దోపిడీని ఎవరూ ప్రశ్నించకూడదు. బండల కార్మికుల హక్కుల కోసం పోరాడిన సూర్యనారాయణ అనే ట్రేడ్ యూనియన్ కార్యకర్తను సిమ్మెంటు నగర్‌లో వీరు దారుణంగా చంపివేసారు. మహిళలు సారా వద్దంటే వీరు అత్యంత క్రూరంగా వారిపై దాడి చేసారు. ఇటువంటి ఘటనలు కోకొల్లలు.

నాగరిక సమాజం అని చెప్పబడుతున్న సమాజంలో ఇటువంటి నిరంకుశత్వం, చీకటి రాజ్యం కొనసాగుతుండటం ఆశ్చర్యకరమే. అయితే ఇంతకంటే ఆశ్చర్యకరమైనది కొనసాగుతున్న నిరంకుశత్వం, దోపిడీ, దౌర్జన్యాల పట్ల ప్రజల హక్కుల్ని కాపాడతాననే ప్రభుత్వం, ప్రభుత్వ యంత్రాంగం తీసుకుంటున్న వైఖరి.

## ముఠా నాయకులకు అండ కల్పిస్తున్న ప్రభుత్వం; వారికి రాజకీయ ఆశ్రయం ఇస్తున్న పార్లమెంటరీ పార్టీలు

ప్రజల హక్కులను అత్యంత క్రూరంగా అణచివేస్తూ భయోత్పాతాన్ని సృష్టిస్తూ వందల సంఖ్యలో హత్యలకు, దాడులకు పాల్పడుతున్న ఈ ముఠా నాయకుల పట్ల ప్రభుత్వం తీసుకొంటున్న వైఖరి ఏమిటి? వీరి దుర్మార్గాలకు వ్యతిరేకంగా ప్రజలను, చైతన్యవంతులను చేసి, వారికి ధైర్యం, రక్షణ కల్పించి ముఠా నాయకులను శిక్షిస్తున్నదా అంటే లేదు. ప్రభుత్వం ఈ ముఠా నాయకులకు లైసెన్సులిచ్చి, వారు బహిరంగంగా ఆయుధాలు ప్రదర్శించి ప్రజలను [illegible] చేసేందుకు తోడ్పడుతున్నది. ఒక లైసెన్సు ఆయుధం ప్రక్కన పది లైసెన్సు లేని ఆయుధాలను వారు చెలామణి చేస్తుంటే చూస్తూ [illegible]. ప్రభుత్వ యంత్రాంగం ముఠానాయకుల చేతుల్లో కీలు బొమ్మలుగా వ్యవహరిస్తూ వారి అడుగులకు మడుగులొత్తుతున్నది. ప్రజల హక్కులపై వారు బహిరంగంగా దాడి చేస్తుంటే చూస్తూ ఊరుకుంటున్నది. వారు ఓట్లు గుద్దుకున్నా మనుషుల ప్రాణాలు తీసినా నోరు మెదపదు.

ఇక పార్లమెంటరీ పార్టీలు రాయలసీమలో ప్రజలపై కాక ఈ ముఠాలపై ఆధారపడి తమ ఉనికిని కొనసాగిస్తున్నాయి. వీరికి ఓట్లు వేసేది ప్రజలు కాదు, ఓట్లు గుద్దించేది ముఠా నాయకులే. అందుకే ఈ ముఠానాయకులకే ఎం.ఎల్.ఎ సీట్లు ఇస్తూ, వారినే తమ పార్టీలకు నాయకులుగా నియమిస్తున్నాయి. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అనేది ఇక్కడ ముఠా నాయకుల స్వామ్యంగా వర్థిల్లుతున్నది. దేశ ప్రధానమంత్రి ఈ ముఠా నాయకుల బలంతోనే నంద్యాల ఎన్నికలలో రికార్డు స్థాయిలో రిగ్గింగ్ చేసి రికార్డు మెజారిటీ సంపాదించాడు. ఇక ప్రస్తుత ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కరరెడ్డి గారు ముఠా నాయకుల అండదండలతో పాణ్యంలో దొంగ ఓట్లు వేసుకొని గెలిచాడు. తనకు రికార్డు స్థాయి మెజారిటీ రాలేదని పాణ్యం ప్రజలను అనేక గ్రామాలలో వెళ్ళి బెదిరించాడు. కాళ్ళపైబడి క్షమాపణలు చెప్పకపోతే అంతు చూస్తానని హెచ్చరించాడు. ఒకవైపు ప్రభుత్వ వత్తాసుతో, మరోవైపు పార్లమెంటరీ పార్టీల అండదండలతో రాయలసీమలో ప్రజాస్వామ్యం మూడు తుపాకులు ఆరు బాంబులు, పన్నెండు వేట కొడవళ్ళుగా వర్థిల్లుతున్నది.

## భూస్వామ్య సాయుధ ముఠాల దోపిడీ, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా ప్రజలు ఉద్యమించాలి!

రాయలసీమ ప్రజలు ఎదుర్కొంటున్న కరువు, దుర్భిక్షం. వెనకబాటుతనం

(తరువాయి 59 వ పేజీలో)

# ఆయన మహోన్నతమానవుడు

— దివికుమార్



ఓ అజ్ఞానీ! ఓ సోమరీ !
ఈ విశాల విశ్వాన్ని సందర్శించిరా !
లభించదు మరో జీవితం దీనికోసం
కలకాలం జీవించినా తిరిగిరాదు
నవ యౌవన మధుమాసం
ఒకే చోట చిరకాలం నిలిచిపోరాదు
నిరంతరం గమన శీలివిగా మారు-

(రాహుల్జీ శత జయంతి సంవత్సరం 1693-1993)

నవ జిందా బజిందా అనే ఉర్దూ కవి రాసిన పై కవిత ప్రభావం పడ్డ ఒక పసి బాలుడు ఇంటినీ, ఊరునీ విడిచి, రాష్ట్రాలూ దేశాలూ నడిచి ఏ కాలేజీలో, యూనివర్శిటీలో చదువుకోకుండానే మహా పండితుడయ్యాడు. గొప్పసాహితీవేత్తగా పరిశోధకుడుగా, చరిత్రకారునిగా రూపొందాడు. అంతేకాదు ...తన పాండిత్యాన్ని సమాజం మార్పుకే వినియోగించాడు. తానే స్వయంగా బ్రిటీషు సామ్రాజ్యవాదులకూ, జమీందార్లకూ వ్యతిరేకంగా సాగించిన పోరాటాల్లో ముందు నిలిచి అనేకసార్లు జైలు శిక్షలకు గూడా గురయ్యాడు

ఆయన ఎవరో కాదు, రాహుల్జీ. ఉత్తరప్రదేశ్‌లోని అజంగడ్ జిల్లాలో ఆయన జన్మించాడు. తల్లిదండ్రులు ఆయనకి పెట్టిన పేరు కేదార్‌నాథ్ పాండే. 1993 ఏప్రియల్ నెలకి ఆయన పుట్టి నూరు సంవత్సరాలు నిండుతుంది. చనిపోయి 30 ఏళ్ళు. 34కి పైగా భాషల్లో ఆయన చదివి, మాట్లాడగలిగేవాడట. హిందీ సంస్కృతం, పాళీ, టిబెటన్, భోజపురి భాషల్లో ఆయన 50,000 పేజీలకు పైగా రచనలు చేశాడు.

ఇరుకు గదుల, బట్టీయపు చదువుకాదాయనది. విశాల జీవితమే ఆయన పాఠశాల. మార్కులూ పరీక్షలూ, డిగ్రీలు ఆయన లక్ష్యం కాదు. నేర్చుకోవాలన్న నిరంతర జిజ్ఞాసా, తపనా, సత్యాన్వేషణే ఆయన ధ్యేయం.

మొదట హిందూమత సన్యాసిగా మారి "రామ్ ఉదార్ దాస్" అనే పేరు పెట్టుకుని ఎన్నెన్నో క్షేత్రాలూ, ప్రదేశాలూ దర్శించాడు. ప్రాపంచిక సుఖాలనన్నిటినీ వదిలేశామంటూనే ఐహిక సుఖాలపై సాధువులూ, సన్యాసులూ పడే తాపత్రయాన్నీ ...యాంత్రికమైన విగ్రహారాధననీ, పూజా విధానాన్నీ ఆయన జీర్ణించుకోలేకపోయాడు. వర్ణ కులాల వ్యవస్థనీ, మూఢ భక్తినీ (ఆనాటికి) తిరస్కరించే "ఆర్య సమాజం" పట్ల ఆకర్షితుడయ్యాడు.

ఆ రోజుల్లో "[illegible]మ్మ దేవత"లకి జంతు బలులిస్తుండేవారు. రహస్యంగా "నరబలి" కూడా యిచ్చేవారు. హిందూమత పెద్దలెవరూ దీన్ని ఖండించినట్టుగానీ, వ్యతిరేకిస్తూ ప్రజలకి "నీతి బోధలు చేసినట్టుగానీ మనకు కనబడదు. కానీ రాహుల్జీ ఒకసారి అయోధ్య నుంచి పైజాబాద్ వస్తుంటే మార్గమధ్యంలో వున్న ఒక కాళికా దేవి గుడిలో మేకను బలి యిస్తుంటే అడ్డుకుని ఒక సమావేశాన్ని ఏర్పాటుచేశారట. ఛాందసులైన మతాధిపతులు ప్రజల్ని రెచ్చగొట్టి ఆయన్ని కొట్టించారట.

రాహుల్జీ పంథొమ్మిదవ యేట పండిత రామావతార శర్మ అనే ఆయన ఉపన్యాసం విని చాలా ఆకర్షితుడయాడట. గొప్ప విద్వాంసుడైన "శర్మ" వేదాలను, దేవుడ్ని నమ్మేవాడు కాదట. ఆయన ఉపన్యాసం విన్నప్పటి నుంచీ రాహుల్జీలో హేతువాదం పట్ల ఆసక్తి, అన్వేషణా తీవ్రమైనాయి. ఆర్య సమాజంకూడా మార్పు లేని మూఢాభిప్రాయాల మయమై దారీ తెన్నూ లేని అంధ విశ్వాసంగా ఆయనకు తోచింది.

ఆ తర్వాత ఆయన బౌద్ధమతంపైపు ఆకర్షితుడయాడు. ఉనికిలోలేని 'పాళీ' భాషను నేర్చుకుని అందులో కూడా రచనలు చేశాడు. "త్రిపిటకాచార్య" అనే అత్యున్నత గౌరవంతో కూడిన బిరుదును పొందాడు. భారతదేశంలో ఆయన చూడని ప్రదేశం లేదంటే అతిశయోక్తి కాదు. అంతేనా.... మంచుతో కప్పబడిన హిమాలయ పర్వత శ్రేణుల్ని దాటుకుంటూ, దారీ తెన్నూ లేని మార్గాల్లో ప్రయాణిస్తూ 4 సార్లు టిబెట్టు దేశం వెళ్ళారు. శ్రీలంక, రష్యా, చైనా, జపాను, యూరప్ ఇలా ఎన్నెన్నో దేశాలు పర్యటించారు తన అనుభవాలనూ, జ్ఞానాన్నీ రచనల రూపంలో మనకందించి వెళ్ళారు.

సాధారణంగా మేధావులూ, పండితులూ అనుకునే వారెలా ఆలోచిస్తారంటే "ఈ ప్రపంచానికి మేము నీతి బోధలు చేస్తూ వుంటాం. ప్రజలు మావల్లనే జ్ఞానం పొందుతూ వుంటారు. మేము మాత్రం ప్రజల జీవన సమస్యల్లోకి దిగము. రాజకీయాలకి దూరంగా వుంటాము. మా సౌకర్యవంతమైన జీవితానికి ఏమాత్రం భంగం లేకుంటేనే "జనం" గురించి పట్టించుకుంటాం"....అంతే! వారు పై మాటలు కూడా నోటితో చెప్పరు. చేతల్లో చూపిస్తారన్నమాట !!

కానీ రాహుల్జీ అటువంటివాడు ఎంత మాత్రం కాదు.

1919 ఏప్రిల్‌లో....జలియన్ వాలాబాగ్ దురంతాలను విసీ, అక్కడి మిలిటరీ పరిపాలనను రుచి చూసీ తీవ్రంగా స్పందించాడు. తన సంస్కృత పాండిత్యంగానీ, ఆర్య సమాజ సిద్ధాంతాలు, జీవితంగానీ జనరల్ డయ్యరు దురాగతాలను ఎలా ఎదుర్కోవాలో నేర్పలేదు. ఆ సంఘటనతో బ్రిటీషు సామ్రాజ్యవాదాన్ని అంతం చెయ్యకుండా గ్రామీణ రైతాంగపు కడగండ్లను తొలగించకుండా మన దేశంలో స్వేచ్ఛా సమానత్వాలు ఏర్పడవని గట్టిగా భావించాడాయన.

సహాయ నిరాకరణోద్యమంలో రైతాంగపు పోరాటాల్లో కృషిచేశారు. అనేక సార్లు అరెస్టుకి గురయి కొన్ని సంవత్సరాల జైలు జీవితం గడిపారు. గాంధీయిస్టుగా మారారు. జైలు పరిస్థితుల మెరుగుదలకోసం నిరాహారదీక్షలు చేశారు. అరెస్టుని తప్పించుకోవానికి రహస్య జీవితానికి కూడా వెళ్ళారు."

"చిన్ని నా బొజ్జకు శ్రీరామరక్ష" అనుకుంటూ దేశాన్ని గురించి, ప్రజల గురించి పట్టించుకోకుండా వుండే మేధావులనుకునే వారికీ, రాహుల్జీలాంటివారికీ మధ్య వున్న తేడా ఇదే.

రాజకీయ ఉద్యమ అనుభవాలతో బుద్ధిజం, గాంధీయిజంనుండి 'మార్క్సిజం' వైపుకి ప్రయాణించాడు. "వైజ్ఞానిక భౌతికవాద" అనే తన పుస్తకంలో గాంధీని "ధనిక స్వాముల తొత్తు" అని విమర్శించాడు. "రామరాజ్యమా-మార్క్సువాదమా?" అనే పుస్తకాన్ని కూడా రచించాడు. ఆయన కమ్యూనిస్టు పార్టీ సభ్యుడుగా చాలా కాలం వున్నాడు. 1944లో మన బెజవాడలో జరిగిన అఖిల భారత రైతు మహా సభకి ఆయన అధ్యక్షత వహించాడు.

భారతదేశంలోని బడుగు జనుల జీవితంలో నిజమైన మార్పు రావాలని ఆయన ప్రగాఢంగా వాంఛించాడు. రైతుల్నీ, కూలీల్నీ, కార్మికుల్నీ దోపిడీ చేసే వర్గాలను తీవ్రంగా ద్వేషించాడు. అంటరానితనాన్నీ, పుట్టుక కారణంగా నీచంగా చూడటాన్నీ అసహ్యించుకున్నాడు.

1937లో రాహుల్జీ "తుమ్హారీ క్షయా" (నీ పతనం) అనే పేరుతో 8 వ్యాసాల పుస్తకాన్ని బీహార్‌లోని ఛాప్రా జైల్లో వుండగా రాశారు. ఈ వ్యాసాల శీర్షికలు చూస్తే చాలు ఆయన సామాజిక దృక్పథం అర్థమవుతుంది.

1. ఈ సమాజ దుష్టత్వం పతనంకాక తప్పదు
2. పతన మవాల్సిన మతమౌఢ్యం
3. ఈ భగవంతుడు పతనం కాక తప్పదు
4. ఈ న్యాయ వ్యవస్థ పతనం కాక తప్పదు
5. సదాచార పతనం తప్పదు
6. నీ సంస్కృతీ దురభిమానం పతనం కాక తప్పదు
7. కుల మత భేదాలు పతనం కాక తప్పదు
8. ఈ జలగలు నాశనం కాక తప్పదు

---

జమీందారీ వ్యవస్థ, సామ్రాజ్యవాదం పెట్టుబడిదారులు, వడ్డీ వ్యాపారులు, అవినీతిపరులు, అగ్రవర్ణ కుల దురహంకారులు ...తమకు అనుకూలంగా సమాజాన్ని మార్పొందించుకుంటున్నారు. అందువల్లనే పేద ప్రజలకు కష్టాలు కలుగుతున్నాయి. ప్రజలు చైతన్యవంతులై పోరాడితేగాని ఈ దుష్ట సమాజం పతనం కాదని రాహుల్జీ ఆ వ్యాసాల్లో పేర్కొన్నాడు.

1922లో రాహుల్జీ లండన్‌లో ఉండగా ఒక చైనా విద్యార్థి ఆయన దగ్గర కొచ్చి "అంటరానితనం అంటే ఏమిటండీ" అని అడిగాడట. అతనికి అర్థమయ్యేట్టుగా చెప్పడానికి రాహుల్జీ ఎంతో కష్టపడాల్సి వచ్చింది. "అదేమైనా అంటువ్యాధా? కుష్టు వ్యాధి వంటిదా?" అని చైనా విద్యార్థి అడిగాడట.

"వారు కూడా మనలాగే ఆరోగ్యంగా వుంటారు. కానీ వారిలో ఎక్కువ మంది ఆర్థిక స్థితి చాలా అధ్వాన్నంగా వుంటుంది" అని అరగంటకు పైగా అతనికి అర్థమయ్యేట్టు చేయడానికి చూశాడట. ఊహూం ...అర్థంకాలా. అమెరికాలో నీగ్రోల గురించి చెబితే కొద్దిగా అర్థమయిందటగాని ఒకే రంగూ, ఆకారమూ వున్న వారిలో అంటరానితనమెలా వుంటుందో ఆ చైనా విద్యార్థి ఊహకు మాత్రం అందలేదట.

"హిందువుల మత గ్రంథాలు అంటరానితనాన్ని ఆధ్యాత్మిక పరంగానూ, తత్వరీత్యానూ వ్యాఖ్యానిస్తున్నాయి. గాంధీ అంటరానితనాన్ని నిర్మూలించదలచినా హిందూ శాస్త్రాలనూ, వేదాలనూ తనతోపాటు తీసుకువెళ్ళ గోరుతున్నాడు. ఇది బురదతో బురదను కడగటం వంటిదే." నంటాడు రాహుల్జీ. అంతేకాదు "స్థిరమైన జాతీయ సమైక్యత భారతదేశానికి చాలా అవసరం. దానిని కులాలు, మతాలు అనే అడ్డుగోడల్ని కూల్చివేయడం ద్వారా నెలకొల్పగలం" అంటాడాయన.

ఒకసారి రాహుల్జీ రైల్లో ప్రయాణిస్తుండగా ముస్లిం నాయకుడొకాయన కలిశాడట. ఆయనకు కమ్యూనిస్టులంటే చాలా భయం. ఆయన రాహుల్జీని అడిగాడట "కమ్యూనిస్టులు పేదరికాన్ని తొలగించాలనటం మంచిదే! ఇస్లాం కూడా సమానత్వాన్నే కోరుతోంది. కానీ వారు మత వ్యతిరేకులుగా ఎందుకున్నారు?" అని.

అందుకు రాహుల్జీ "కమ్యూనిస్టులు మతానికి వ్యతిరేకంగా ఏ మాత్రం తమ శక్తిని ఖర్చు చేయడానికి ఇష్టపడటంలేదు. మతోన్మాదంతోనే ప్రస్తుతం వారి పేచీ! వారు ప్రపంచంలో సామాజిక దురాగతాలు, పేదరికం పోవాలనే కోరుతున్నారు" అని జవాబిచ్చాడట.

మత ప్రాతిపదికన జాతులుగా ప్రజల్ని విభజించటాన్ని రాహుల్జీ తీవ్రంగా నిరసించాడు. "హిందూ మహాసభ, ఆర్.ఎస్.ఎస్. వంటి సంస్థలకు చెందినవారు మనలో భేదాలను పెంచడానికి మత ప్రాతిపదికగా 'హిందువులందరూ ఒకే జాతి'

జాని ఉద్ఘాటిస్తూ వుంటారు. ముస్లింలను ప్రత్యేక జాతిగా గుర్తింపజేయాలని ముస్లిం లీగ్ కంకణం కట్టుకుంది." అని రాశాడాయన.

ప్రపంచంలోని అనేక దేశాలు తిరిగివచ్చిన అనుభవంతో మనదేశ పరిశుభ్రత గురించి రాహుల్జీ చాలా ఆవేదన చెందాడు. "ఇప్పటి వరకు మనం మానవులవలె జీవించటం కూడా నేర్చుకోలేదు. పరిసరాల శుభ్రతను నిర్లక్ష్యం చేయటంలో మనం జంతువులకన్నా హీనులం. భారతదేశంలో నన్ని మురికి గ్రామాలు ప్రపంచంలో మరే దేశంలోనూ లేవు ... ఆరోగ్యానికీ, పరిశుభ్రతకీ అత్యంత అవసరాలైన వాటిని మన పూర్వీకులు ఎందుకు నిర్లక్ష్యం చేశారో చాలా ఆశ్చర్యంగా వుంది.... మలం తీసుకువెళ్ళే వారిని మన దేశంలో అందరికంటె నీచంగా భావించారు. పాకీ పని వారిని మనం అట్టడుగు దారిద్ర్యంలో బంధించి వుంచాము. అంటరాని వాళ్లకి తమ ఆకలి ముందు ఆత్మగౌరవం జ్ఞాపకానికి రావటంలేదు" పేద ప్రజలకు ముఖ్యంగా స్త్రీ, బాల, వృద్ధులకు ... ప్రకృతి సహజమైన కాలకృత్యాలు తీర్చుకోవటం కూడా నిత్యజీవిత సమస్యగా ఈ దోపిడీ వ్యవస్థ మార్చివేసింది.

రాహుల్జీ యొక్క జపాను మిత్రుడొకాయన భారతదేశం వచ్చి గ్రామీణ ప్రాంతాలను స్వయంగా చూడాలనే కోర్కెను వెలిబుచ్చగానే, ఆయన ఇక్కడి పారిశుధ్యపు అసహ్యాన్ని చూసి మన దేశాన్ని చులకనగా భావిస్తాడేమోనని రాహుల్జీ విలవిలలాడిపోయాడు.

సంవత్సరం ఈ మధ్య కాలంలో మన రాష్ట్రంలో సాగిన సారా వ్యతిరేకోద్యమం దేశాన్నే కుదిపివేసిందికదా! మద్యపానం గురించి రాహుల్జీ ఏం రాశారో తెలుసుకుంటే కొందరు పెద్దలు, మతాలు చెప్పే నీతి సూత్రాలు ఎంత నిస్సారితమైనవో అర్థమవుతుంది.

"ప్రపంచంలోని ప్రధాన మతాలన్నీ మద్యపానాన్ని నిషేధిస్తున్నాయి. ఇస్లాం మతం కూడా తాను మద్యపానానికి బద్ధ శత్రువునని చెప్పుకుంటోంది. సారాయి తాగటం గొప్ప దురాచారంగా భావించ బడుతోంది. అయితే గత పదమూడు సంవత్సరాల కాలంలో ధనవంతుల్లో ఎంతమంది దీన్ని పాటించారు? ఎన్నో చోట్ల సారాయి అంగళ్ళ యజమానులు ముస్లింలే- ముస్లిం రాజ్యాలు మద్యపానానికి కఠోరమైన శిక్షలు విధించిన కాలంలోనే ధనికులు మాత్రం సారాయి తాగటానికి ఏటువంటి ఆటంకమూ కలుగలేదు. హిందువుల్లో కూడా ఎన్నో సంప్రదాయాలు మద్యపానాన్ని మహా పాపమని భావించాయి. కానీ ఎన్ని కులాలకు చెందిన సంపన్నులు దీనినుండి దూరంగా వుండగలిగారు? బ్రాహ్మణులైనా, వైశ్యులైనా, క్షత్రియులైనా డబ్బులు ఎక్కువగా వున్నవారు నిరాటంకంగా తాగుతారు. ఆ కులాల్లో పేదవారు వారిని చూస్తూ ఉడుకుంటారు. మద్యపానానికి వ్యతిరేకమైన గాంధీజీ అనుయాయుల్లో

ఎంతో మంది బహిరంగంగా మద్యపాన నిషేధాన్ని ప్రశంసించినప్పటికీ లోలోన దానికి వ్యతిరేకాభిప్రాయమే కలిగి వున్నారు"

మద్యాన్ని పుచ్చుకోవద్దని పేద ప్రజలకు నీతులు చెప్పే గాంధీ భక్తులూ, మత పెద్దలూ ధనికులకీ, కుల పెద్దలకీ ఈ బోధనెందుకు చేయరు? అన్నది రాహుల్జీ సూటిప్రశ్న. తమ సంస్థల నుండి తాగుబోతుల్ని ఎందుకు వెలివెయ్యరు? వారి కందులో నిజాయితీ పట్టుదలా లేవు కనుకనే ఈ నాటికి తాగుడు సమస్య భయంకర భూతంలా రాజకీయార్థిక దోపిడీ సాధనంగా వారికి తోడ్పడుతోంది.

హిందూ మతం పేరుతో, రామరాజ్యం సాకుతో నేడు మన దేశంలో ఎంత మారణహోమం జరుగుతోందో మీకు తెలుసుకదా! ఏన ప్రాచీన సంస్కృతీ, చరిత్రా అని పెద్దగా కేకలు పెడుతూ గతమంతా ఎంతో ఆదర్శమైనదిగా కీర్తించే "సంస్కృతీ దురభిమానుల్ని" రాహుల్జీ తన విశేష పాండిత్యానుభవంతో తీవ్రంగా విమర్శిస్తాడు.-

"మన భారతదేశ చరిత్రంతా రాజుల పురోహితుల చరిత్రే! వారు నేడు (1937) లాగానే ఆనాడు కూడా విలాసవంతమైన జీవితం అనుభవించేవారు. తమ రక్తాన్ని చిందించి తాజ్‌మహల్‌నీ, ఈజిప్టులోని పిరమిడ్లనూ నిర్మించిన అసంఖ్యాకమైన ప్రజల గురించి ఎక్కడైనా పేర్కొనబడ్డదా?" అని ప్రశ్నించి, అలా లేదంటూ, రామరాజ్యమని చెప్పుకునేది కూడా స్త్రీలనూ, శూద్రులనూ, పేదల్ని అణచి వేసిందని ఆయన స్పష్టం చేస్తారన్నమాట. ఆయన మాటల్లోనే చూడండి.

"హిందువుల చరిత్రలో శ్రీరామునికి ప్రత్యేక స్థానమున్నది. మన మహా నాయకుడైన మహాత్మాగాంధీ కూడా ప్రతి సందర్భంలోనూ రామరాజ్యాన్ని పేర్కొంటూండేవారు. శంబుకుడనే శూద్రుడు ధర్మార్జన కోసం తపస్సు చేయటానికి పూనుకోగా, అది వర్ణాశ్రమ ధర్మానికి విరుద్ధమని శంబుకుని తలను నరికిన ధర్మావతారమైన శ్రీరాముని రాజ్యం ఎలా వుండి వుంటుంది? ఎవడో అనామకుడు వేసిన అపనిందకు వెరచి గర్భిణియైన భార్యను అడవికి పంపించి వేసిన రాముని రాజ్యం ఎలా వుండి వుంటుంది? రామరాజ్యంలో కూడా స్త్రీ పురుష బానిసలకు కొదువలేదు" అని రాహుల్జీ రాశారు.

రామరాజ్యంలో పేర్కొనబడిన దాసదాసీ పరిజనుల విధులు, హక్కులు ఏమిటి? వారు ఏమి తిన్నారు? ఆ కాలంలో సహజావసరాలైన తిండీ, గుడ్డ, యిల్లు ఎవరు, ఎలా ఉత్పత్తి చేశారు వారెలా జీవించారు.... మొ॥వి విశ్లేషిస్తేనే రాచరిక

(తరువాయి 16వ పేజీ)

స్వదేశీ తయారీ విదేశీ మద్యాన్ని, చీప్ లిక్కర్లను ప్రభుత్వం పంపిణీ చేయడాన్ని ఆపివేయాలి!

దిగ్గుని లేచింది
భగ్గుమంది
భయంకరమయిన జ్వాలయింది
చిట పట లాడింది
చిట్లింది
సరసర మండింది దుగ్గేరు

రెండొందల గ్రామాలు
దండెత్తాయి —
కాల్పులూ బీభత్సమూ
లాఠీ చార్జీ గాయాలూ —

దుగ్గేరు గర్జించింది
కొండలు గగ్గరించాయి
నాటి శ్రీకాకుళం ఏజన్సీ
నేడు మళ్ళీ ప్రకంపించింది

గిరిజన నాయకుల అరెస్టులు
రై. కూ. సం. నాయకుల గాలింపులు
దుగ్గేరులో "క్యాంపు"!
పరిసరాలలో టెర్రర్!

"క్యాంపు"ను తొక్కుకుంటూ
గిరిజనుల ఊరేగింపు!
పోడు మా జన్మ హక్కంటూ
కలెక్టరు ముందు ప్రదర్శన!

సాలూరు మక్కువ
కొమరాడ పార్వతీపురం
మండలాల గుండెలు
బుగులొక్కన్నాయి
భగ భగ మండాయి
ఫారెస్టు వాళ్ళ భూస్వాములు
సారా వాళ్ళ షావుకార్లు
మొండేలలో గుండెలు

మొగులుపో ఉర్నాయి
దఢ దఢ లాడాయి

ధగ ధగ మెరిసింది
పెళ పెళ ఉరిమింది
చిచ్చర పిడుగై లేచింది
పిట పిట లాడింది
పిట్లింది
జిగేల్మంది దగ్గేరు

— ఛాయరాజ్

14 వ పేజీ తరువాయి)

పరిపాలనలో ప్రజలెలాంటి జీవితం గడిపినదీ అర్థంకాదు.

డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు లాంటి వారినైనా సరే విమర్శించ టానికి రాహుల్జీ వెనుకాడలేదు. డా॥ సర్వేపల్లి "ప్రాచీన భారతదేశంలో ఏ కళకి గానీ, శాస్త్రానికి గానీ తత్వజ్ఞానం దాస్యం చేసేది కాదు." అంటుండేవారట. ఆ అభిప్రాయాన్ని ఖండిస్తూ రాహుల్జీ "నిజానికి భారతదేశంలో తత్వశాస్త్రం ఎప్పుడూ మతానికి లోబడే వుండేది. పైగా మత దాస్యం కంటె హీనమైన దాస్యం మరొకటి వుండదు" అని రాశాడు.

ఆయన పండితుల్లో మహా పండితుడు, మానవుల్లో మహోన్నత మానవుడు! అయినా ఆయన పరిమితులు ఆయనకున్నాయి. 'ఏ వ్యక్తీ లోపరహితుడు కాదు. అసలే పొరపాట్లు చేయని వారుండరు. దాన్ని గుర్తించిన వినయం, నమ్రత ఆయన కున్నాయి. అందుకే ఆయన యిలా అంటాడు.

"ఏ వ్యక్తీ సంపూర్ణ మానవుడు అని నేను విశ్వసించను. సత్యంపై సర్వాధి కారాలు నాకు లేవు. నాకు చేతనైనది నేను చేస్తాను. భావితరాలవారు నేను చేసిన పనిని ఉన్నత శిఖరాలకు తీసుకువెడతారని నేను ఆశిస్తాను."

ఆయన విశాల హృదయ సౌందర్యాన్నీ, నిరంతర జిజ్ఞాసా తత్వాన్నీ అల వరచుకుని ఆయన ఆశించిన దోపిడీ పీడనా రహితమైన స్వేచ్ఛా స్వాతంత్ర్య సమా జాన్ని స్థాపించడానికై సంకల్పిద్దాం.

---

సారా కాంట్రాక్టర్ల ఆస్తులను స్వాధీనం చేసుకొని గ్రామాల, పట్టణాల అభి వృద్ధికై వెచ్చించాలి!

సమీక్ష :

# సాహిత్య పరిశీలనలో కుల ప్రమాణం తప్పు కాదు

గురజాడ అప్పారావు పైనా, ఆయన రచనలపైనా వివాదం చెలరేగడం ఇది మొదటిసారి కాదు. ఆయన కవిత్వం కవిత్వమే కాదని, నాటకం నాటకమే కాదని, ఆ నాటకం ఆయన రాయలేదని, అకవి అని, బ్రిటిష్ పాలనను సమర్థించాడని, రాజులకు ఊడిగం చేశాడని గడచిన యాభై ఏళ్ళలో ఆయనపై ఎన్నో విమర్శలొచ్చాయి. ఇప్పుడు దళిత సాహిత్య శిబిరం నుంచి గురజాడపై విమర్శ రూపంలో సరికొత్త అంచనా ప్రత్యక్షమైంది. ఇంతకాలం ఆయన సాహిత్యంపై వచ్చిన విమర్శల్లో కొల్లా వెంకయ్య చేసిందీ, ఇప్పుడు బి.ఎస్. రాములు చేస్తున్నదీ మాత్రమే ప్రగతిశీల శిబిరాల నుంచి కావడం విశేషం.

'కన్యాశుల్కం'ను ఇపుడెలా చూడాలి?- అన్న శీర్షికలో బి.ఎస్. రాములు రాసిన పత్రంలో చెప్పిన ప్రధానమైన అంశాలు ఇవి :

1. గురజాడ చిత్రించిన 'కన్యాశుల్కం' జీవితం పాతబడిపోయింది.
2. కందుకూరి, గురజాడ నుంచి విశ్వనాథ, చలం, శ్రీశ్రీ, కృష్ణశాస్త్రి, కొ.కు.ల దాకా చిత్రించిన జీవితం బ్రాహ్మణులది. బ్రాహ్మణుల కొరకు చిత్రీకరించబడింది. ఆ జీవితం ఫ్యూడల్ బ్రాహ్మణ వ్యవస్థ పెట్టుబడిదారీ మను బ్రాహ్మణ వ్యవస్థగా తన ఉనికిని రూపాంతరం చెందించుకుని అభివృద్ధి చెందడానికి సంబంధించినది.
3. కన్యాశుల్కమూ గురజాడా అంతిమంగా విశ్వనాథ సత్యనారాయణ కోరుకున్న క్రమాన్ని ప్రగతిశీలత రూపంలో సాధించే పరికరాలుగా మారిపోయారు.

పై ప్రతిపాదనల పరిధి నుంచి గురజాడ కవిత్వంతో సహా కవిత్వాన్నంతటినీ మినహాయించినట్టున్నది. పాత్రల నేపథ్యం, జీవిత చిత్రణ ప్రధానంగా తీసుకున్నందున కథ, నవల (ఫిక్షన్) లకు పరిమితమైనట్టున్నది. బి.ఎస్. రాములు ప్రతిపాదనలు ప్రధానంగా సాహిత్య రచన-కులము, సాహిత్యంలో కులము, సాహిత్యంపై అంచనా-కులము అన్న మూడు అంశాలను స్పృశించింది.

బి.ఎస్. రాములు చెప్పిన విషయాలలోకి వెళ్ళేముందు -ఆయన ప్రతిపాదనలు చదివిన వెంటనే కలిగే దిగ్భ్రమను శాంతింప చేసుకోవాలి. వేమన వ్యాపారస్తుల కవి, గురజాడ బూర్జువా రచయిత అని త్రిపురనేని మధుసూదనరావు రాసినప్పుడు కూడా ఆ పదాలు, ముద్రలుస్తే ఉన్న ప్రతిఘాలత పల్ల బౌద్ధికులకు కొందరికి షాకింగ్ గానూ, అపచారంగానూ కనిపించింది. వర్ణ వ్యవస్థను, కులాధిపత్యాన్ని

సాహిత్య నిశిత పరిశీలనలో ప్రమాణాలుగా స్వీకరించడం ఇప్పటి దాకా లేదు. కనుక రాములు రచన చాలా మందిలో తక్షణ తిరస్కారాన్ని కలిగించవచ్చు. రాములు రాసింది తప్పయినా ఒప్పయినా అది ఒక అభిప్రాయమనీ, బ్రాహ్మణవాద భావాలు ఆధునిక ప్రగతిశీల రచయితలలోనైనా వెదికే ప్రయత్నం చేయడం అపచారం కాదనీ తెలుసుకోవాలి. కుల చిహ్నాలను విసర్జించడం, వ్యక్తిగతంగా వివక్షను పాటించకపోవడం చేస్తే కులం అంతరించి పోతుందని, రాజకీయ, సాంస్కృతిక ఎజెండాలో అనేక ప్రధానమైన అంశంగా తీసుకోనక్కరలేదనీ అభిప్రాయపడి ఉద్యమాలు వ్యవహరించడం వల్ల కులం నిషిద్ధ ప్రమాణమై పోయింది. విక్టోరియన్ నైతికత శృంగారంపై విధించినంత నిషేధాన్ని ఆధునిక ప్రగతిశీల కులంపై విధించింది. ఫలితం- నిషేధంతో నిమిత్తం లేకుండా వాస్తవికత మనసాగింది

సామాజిక, రాజకీయ రంగాలలో కొద్ది కాలంగా వినిపిస్తున్న ప్రశ్ననే. బి.ఎస్. రాములు సాహిత్య రంగానికి అన్వయించబోయారు. గురజాడ రచనలకు తెలుగుదేశంలోని పీడిత కులాల ప్రజలకీ సంబంధం ఏమిటి? -అని ఆయన ప్రశ్న గురజాడ ప్రతిపాదించిన సంస్కారం బ్రాహ్మణ జీవితాన్ని సరిదిద్దుకోవడానికి సంబంధించింది అయినప్పుడు- ఆధునిక సంస్కారం పొందిన బ్రాహ్మణులు, ఇతర అగ్రవర్ణాలవారు కుల వివక్షను మరో రూపంలో కొనసాగిస్తున్నప్పుడు- ఆ సంస్కరణను దళితులు ఎందుకు ఆమోదించాలి? అన్నది ఆయన సవాలు.

ఈ ప్రశ్నలు వేస్తున్నప్పుడు రాములు రెండు ప్రధానమైన అంశాలను విస్మరించారు. కుల, మత, ప్రాంత, తదితర భేదాలు సామాజిక సంబంధ స్వరూపాలే కానీ సంబంధ రాహిత్య సాధనాలు కావనీ, ఏ తరగతిలో, ఏ శ్రేణిలో జరిగే ఆచరణాత్మక విమర్శ అయినా మొత్తం సమాజాన్ని ప్రభావితం చేస్తుందనీ రాములు గుర్తించలేదు. (తాను ఇప్పుడు చేస్తున్న డిమాండ్లు, ప్రాతినిధ్యం వహిస్తున్న ఆకాంక్షలు బూర్జువా ప్రజాస్వామిక స్వభావం కలిగినవి అయివుండి కూడా) బ్రాహ్మణ వాదాన్ని ప్రజాస్వామిక విలువలు తీవ్రంగా వ్యతిరేకిస్తాయని రాములు మరచి పోయారు.

భారతీయ సమాజాన్ని గతంలో వర్ణించిన విశేషణాలకు తోడు పితృస్వామిక, బ్రాహ్మణవాద- అన్న వాటిని కూడా ఇకపై స్పష్టంగా పేర్కొనవలసి వుంది.

బ్రాహ్మణవాదం అంటే సాంస్కృతికంగా, సామాజికంగా ప్రజల మధ్య అంతరాలను సహేతుకం చేసే వాదం. ఆ అంతరాల ఆధారంగా అశేష ప్రజానీకంపై కులీనుల ఆధిపత్యాన్ని నెలకొల్పే వాదం. బ్రాహ్మణవాదం ఆధారంగా అత్యున్నత శ్రేణిలో నిలబడే కులము, లేదా కులాలు చెలాయించే పెత్తనం ఆయా కులాల్లోని స్త్రీలపై వారికివున్న ఆధిక్యపు పట్టుపై కూడ ఆధారపడి వుంటుంది. బ్రాహ్మణవాదం

బ్రాహ్మణులకు, ఇతర అగ్రవర్ణాలకు, దళితులకు మధ్య వుండే సంబంధాన్ని మాత్రమే కాక, అగ్రవర్ణాలలోని స్త్రీల మధ్య సంబంధాన్ని, దళితులలోని స్త్రీల సంబంధాన్ని కూడా నిర్ణయిస్తుంది; శాసిస్తుంది. దళితులలోని పురుషాధిక్యత, బ్రాహ్మణులలోని పురుషాధిక్యత కూడా బ్రాహ్మణవాదంలోని భావాలే. బ్రాహ్మణుల లోని పురుషాధిక్యత పై జరిగే విమర్శ బ్రాహ్మణవాద వ్యతిరేక పోరా టంలో భాగమే అవుతుంది. గురజాడ 'కన్యాశుల్కం' నాటకం ద్వారా, ప్రేమ సిద్ధాంత ప్రతిపాదన ద్వారా, కులమత రహిత సమాజ ఆకాంక్ష ద్వారా, దేశమంటే మట్టికాదని చెప్పడం ద్వారా, వాడుక భాషా ఉద్యమం ద్వారా బ్రాహ్మణవాద సమా జంపై తొలిదెబ్బ తీశాడు. ప్రజాస్వామిక సాంస్కృతిక ఎజెండాను ఆయన తెలుగు సాహిత్యంలో ప్రతిపాదించాడు. ఆయన కన్యాశుల్కం కొందరు దౌర్జన్యారావులకు ఆయన వాడుక భాష కొందరు వీరేంద్రనాథ్‌లకు ఉపయోగపడి వుండవచ్చు. కానీ ఆయన ప్రారంభించిన క్రమమే బి.ఎస్. రాములు ఈ రోజు ప్రశ్నలు వేస్తున్న నేపథ్యానికి ఎంతో కొంత తోడ్పడింది.

"సాహిత్యం ఎంత త్వరగా పాతబడిపోతే దాని ప్రయోజనం అంత త్వరగా నెరవేరినట్టు" అన్న మాటను రాములు విచిత్రంగా అన్వయించారు. సాహిత్యం పాతబడటమంటే ఏమిటి? అందులో వ్యక్తమైన సామాజిక గతి, ముడి విప్పిన తీరూ ఇప్పుడెంత మాత్రమూ సామయికం కాకపోవడం. ఒక కథలో, నవలలో చాలా పురాతన సమాజాన్ని చిత్రించవచ్చు- 'స్పార్టకస్' నవలలాగా, "సత్యకామ జాబాలి" నాటకంలాగా. ఆ రెండింటిలోనూ ప్రస్తుత సమాజానికి సామయికమైన అంశా లున్నాయి. 'కన్యాశుల్కం'లో చిత్రించిన జీవిత విధానం, ఆచారాలు, అలవాట్లు ఇప్పుడు లేకపోయి వుండవచ్చు. కానీ, అందులో ప్రస్తుత సామాజిక అవసరాలకు తగిన సామగ్రి ఏమీ లేదా? అందులో సూచించిన సామాజిక గతి క్రమం నేటి సమస్యలను అర్థం చేసుకోవడానికి ఏ మాత్రమూ తోడ్పడడం లేదా? దురాచారానికి ధనాశ తోడై పసిపిల్ల గొంతుకోయ తలపెట్టిన పెద్ద మనిషికి బుద్ధి చెప్పి, కథను సుఖాంతం చేయడానికి నాటకకర్త మారు వేషాలను, యుక్తులను ఉపయోగించి వుండ వచ్చు ఏ పాత్రా పరిస్థితులలో తీవ్రంగా సంఘర్షించి వుండకపోవచ్చు. నాటకంలో జీవితం నలుపు తెలుపులలో స్పష్టంగా కనిపించి వుండకపోవచ్చు. కానీ, కథా సంవిధానాన్ని సామాజిక విమర్శకు పదునైన ఆయుధంగా వాడుకున్న తీరు, పాత్రల చిత్రీకరణలో చూపిన వాస్తవిక దృష్టి తెలుగులో మరే నాటకంలోనైనా ఇప్పటికీ

---

మాపు మార్చుకొని వస్తున్న సారాను త్రిప్పి కొట్టండి!

త్రాగునీరు, సాగునీరు సమస్యను వెంటనే పరిష్కరించాలి!

కనిపించాయా అన్నది రాములు పరిశీలించాలి. నేషనల్ కాంగ్రెస్ ఇప్పుడు కూడా నయా సామ్రాజ్య వాదులకు దివాన్గిరీ చేస్తుండగా, జట్కా వాళ్ళను పోలీసులు ఇంకా వేధిస్తుండగా, గవర్నమెంటూ బ్రాహ్మలూ దేవుళ్ళూ వారి పాపాలు వారివి కానీ ప్రజల భక్తి ప్రజల కుండాలి అనే దృష్టే సమాజంలో ఇంకా బలంగా వుండగా 'కన్యాశుల్కం' పాత బడిపోయిన అరవయ్యేళ్ళ క్రితమే చెల్లిపోయిన సరుకు ఎలా అవుతుందో కూడా రాములు ఆలోచించాలి.

'కన్యాశుల్కం'పై విశిష్టమైన అంచనాలను ఇచ్చిన ఆర్. ఎస్. రావు కూడా "ఆధునిక మధ్య తరగతి" అన్న అస్పష్టమైన వర్గీకరణ చేశారు. దాని కులాన్ని, శ్రేణిని ఆయన పేర్కొనలేదు. (విభాత సంధ్యలు: గురజాడ కన్యాశుల్కం - సామాజికాభివృద్ధి క్రమం). అయితే ఆర్. ఎస్. రావు, బి. ఎస్ రాములువంటి పరిశీలననే ఒకటి ప్రముఖంగా చేశారు. అది కన్యాశుల్కంలో గిరిజనుడి పాత్ర లేకపోవడం. "మన దేశంలో చదువుకున్న మధ్యతరగతి చైతన్యంలోకి, తద్వారా వారి రచనలలోకి గిరిజనులు అప్పటికింకా ప్రవేశించలేదు. సామ్రాజ్యవాద పెట్టుబడి ప్రవేశించి గిరిజన ప్రాంతాలలో సాంఘికవైరుధ్యాన్ని సృష్టించి తీవ్రతరం చేసిన తరువాతే వాళ్ళ 'పాత్రలు'గా మన భావప్రపంచంలోకి ప్రవేశించారు. మన రాష్ట్రంలో ఆ క్రమం గురజాడ తర్వాతే జరిగింది. ఈ ఒక్క అంశాన్ని మినహాయిస్తే కన్యాశుల్కం ఇంకా అలాగే కొనసాగుతున్న మన సామాజికాభివృద్ధి క్రమానికి ఒక విమర్శనాత్మక ప్రతిబింబం." రచనలలో పాత్రల ఉనికికి సంబంధించి మంచి విశ్లేషణ ఇచ్చిన పై వాక్యాల్లో కూడా అప్రయత్నంగా దొర్లిన "మన" భావప్రపంచం అనేమాట ఆర్. ఎస్. రావు వంటివారి పరిమితులను కూడా తెలియజేసింది. "వలస పాలనలో ఆరంభమయి ఇప్పటికీ కొనసాగుతున్న మన సామాజిక అభివృద్ధి క్రమస్వభావం మీదా, దాని ఫలితాలమీదా కన్యాశుల్కం నాటకం ఒక నిశితమైన విమర్శ. అందుకే అది ఇంకా సజీవంగా ఉంది. అయితే ఇప్పుడు కన్యాశుల్కం ఎవరైనా రాస్తే అందులో కొన్ని మార్పులుండవా? ఉంటాయి. ఒక గిరిజనుడి పాత్ర తప్పకుండా ఉంటుంది ..." అన్న ఆర్. ఎస్. రావు నిర్ధారణతో రాములు విభేదిస్తారా ?

అయితే, అప్పటికీ ఇప్పటికీ ఒకే సామాజికాభివృద్ధిక్రమం కొనసాగుతున్నదని చెబుతున్న ఆర్. ఎస్. రావు ఆ క్రమం అప్పటికే నిశ్చితమైనదని చెబుతున్నారా?

కందుకూరి వీరేశలింగంవంటి బ్రాహ్మణ సంస్కర్తలకీ, రఘుపతి వెంకటరత్నం నాయుడువంటి మత సంస్కర్తలకీ గురజాడ అప్పారావుకీ తేడా వుంది. గురజాడ అప్పారావుకు ఓ సామాజికమైన కార్యాచరణ ప్రణాళిక వుంది. సంస్కరణలకు సాహిత్యపద్ధతు, వాడుక భాష, కులాల సమానత్వం, మత రాహిత్యం,

స్త్రీ పురుష సమానత్వం, వైజ్ఞానిక దృష్టి, ప్రేమసిద్ధాంతం - ఇదొక విస్తృతమైన మేనిఫెస్టో. ఈ మేనిఫెస్టోను తక్షణం అందుకోగలిగింది నాడు బ్రాహ్మణ సమాజమే. సందేహం లేదు. కానీ, గురజాడ గిడుగువలె "శిష్టవ్యావహారికం"తో ఆగిపోలేదు. వాడుకభాష బ్రాహ్మల అవసరాలకు పరిమితం అని ఆయన అనుకోలేదు. వాడుకభాష "రైతుల తలుపు తడుతుంది, ఇంగ్లీషువాడిని కూడా తట్టి లేపుతుంది" అని కన్యాశుల్కం ముందుమాటలో అన్నారాయన. గురజాడ ప్రతిపాదించిన ప్రణాళికలో పర్టిక్యులర్ అంశం బ్రాహ్మణ్యమే అని ఒప్పుకున్నా, యూనివర్సల్ అంశం కూడా వుంది అది బ్రాహ్మణవాదాన్ని నాశనం చేసే క్రమం. బ్రాహ్మణవాదాన్ని వ్యతిరేకిస్తూ ప్రారంభమైనవారు నయాబ్రాహ్మణులుగా పరిణమించవచ్చు, శంబూకవధను వెల్లడి చేసేవారు తరువాత తరువాత అనేక మందిని శంబూకులను వధించివుండవచ్చు. బ్రాహ్మణవాద వ్యతిరేక పోరాటాన్ని మరొకరు మరొకరు అందుకుంటూ పోతూనేవుంటారు. బ్రాహ్మణవాద వ్యతిరేకతలో ఇమిడివుండే ఒకానొక అంశం కొత్త బ్రాహ్మణులను తయారు చేయడం కూడా. దళితవాదులు ఆత్మవిమర్శ చేసుకుంటే వారిలో కూడా ఈ ఎలిమెంటు కనిపించి తీరుతుంది ఫ్యూడల్ ప్రతిబంధకాల కారణంగా పురోగతికి ఇబ్బందైన బ్రాహ్మణులు గురజాడ ప్రాతినిధ్యం వహించిన ఆకాంక్షల సాయంతో ఆధునిక బ్రాహ్మణవాదులుగా తయారయ్యారా అన్నది ప్రశ్న. అయివుండవచ్చు. కానీ ప్రజాస్వామిక ఎజెండా సాంస్కృతికరంగంలో ఎక్కడ ఓడిపోయి, అర్ధభూస్వామ్య అర్ధవలస ఎజెండా ముందుకు వచ్చిందో గుర్తించకుండా ఈ ప్రశ్నకు స్పష్టమైన సమాధానం చెప్పలేం. భావకవులనుండి విశ్వనాథ, నోరి ప్రభృతులు విడిపోయి వెనక్కి వెళ్ళిన సందర్భమే తెలుగు సాహిత్య గతిని మలుపు తిప్పిందని, అక్కడ నుంచి సంకరత్వం (ఆధునికత, బ్రాహ్మణవాదం కలగలిసి మెలగడం) ప్రారంభమైనదనీ ఒక ప్రతిపాదన. కుల నిర్మూలన అనివార్య భాగంగా వుండే జాతీయవాద స్వాతంత్ర్యపోరాటం దేశీయ భూస్వామ్య శక్తులతో కుమ్మక్కు అవడం వల్ల జరిగిన ద్రోహం, గురజాడ ఆరంభించిన క్రమానికి కూడా జరగలేదా?- అన్నది చర్చించ వలసిన ప్రశ్న.

బి. ఎస్. రాములు చేస్తున్న విమర్శలో ఒక ముఖ్యమైన అంశం - సాహిత్యంలో అన్ని శ్రేణుల, తరగతుల పాత్రలూ, జీవితమూ వుండాలనేది. దీనితో అందరూ ఏకీభవించాలి. 'మాలపల్లి' నవల గురించి గొడ్డపాటి వెంకట కుటుంబరాయశర్మ అనే బ్రాహ్మణవాది తన రీసర్చి గ్రంథంలో "ఈ రచయితకు సంఘజఘన్యజులైనవారు తప్ప మరెవరూ పాత్రలుగా దొరకలేదా ?- అని అడిగాడు. ఈ దృష్టి ఇంకా చాలామందిలో కూడా వుండివుండవచ్చు. ఆధునిక

రూపంలో కూడా రూపు సవరించుకుని వుండవచ్చు. సంఘంలో వివిధ సెక్షన్ల జీవితం, ముఖ్యంగా పీడిత ప్రజల జీవితాన్ని చిత్రించే ప్రయత్నం అభ్యుదయ సాహిత్యోద్యమం నుంచి మొదలైనా, ఆయా సెక్షన్లనుంచి లిఖిత సాహిత్య రంగంలో ప్రవేశించిన రచయితల సంఖ్య బహుస్వల్పం కావటంవల్ల మధ్యతరగతి జీవితమే, ముఖ్యంగా బ్రాహ్మణ మధ్యతరగతి జీవితమే సాహిత్యంలో బలంగా కనిపించింది. ఉన్నత కులాల సాహిత్యంలో ఉత్తమ, అధమ, పాప్యులర్ వంటి భేదాలున్నట్టే, నిమ్న కులాలనే కులాలలో కూడా అంత విస్తృతీ, వైవిధ్యమూ సాహిత్యంలో వుండాలి. అదే వారి వికాసానికి తోడ్పడేది. ఎవరు పాత్రలుగా ఉన్నా సాహిత్యంనుంచి స్వీకరించే అంశం వుంటుందనేది ఎంత నిజమో, దళిత పాత్రలతో ఉన్న రచనలోకూడా బ్రాహ్మణవాదం వుండవచ్చుననేది ఎంత నిజమో, దళితుల జీవితాన్ని ఎంత వక్రంగా, అసమర్ధంగా చిత్రించినా సరే, అది సాహిత్య రంగంలో సమగ్రతకు తోడ్పడుతుందనేది అంత నిజం. ఇంత కాలమూ వారి జీవితం సాహిత్యంనుంచి వెలిఅయివుండడమే ఇందుకు కారణం.

విశ్వనాథా గురజాడా ఒకటేనని, విశ్వనాథకంటే గురజాడ ఎక్కువ ప్రమాదకారి అని రాములు విసిరిన అస్త్రం వాదనకు నిలబడదు. అది ఆయనకు కూడా తెలుసును. తన ప్రతిపాదనలకు తీవ్రత సమకూర్చుకునేందుకు మాత్రమే ఆయన ఆ వ్యాఖ్య చేశారని అనుకుంటున్నాను. వాదం ప్రకారం విశ్వనాథా, గురజాడ బ్రాహ్మణ సమాజపు రచయితలే అనుకున్నా, వారి మధ్య వైరుధ్యాన్ని చూడ నిరాకరించడం తత్త్వశాస్త్రం చదివిన రాములుకు తగినది కాదు.

రాములు తన వ్యాసం ద్వారా ఇప్పుడు ఒక మార్గంలో ఆలోచిస్తున్న సాహిత్యకారులందరినీ డిఫెన్స్‌లోకి నెట్టేశారు. ఆయన చర్చను ఆహ్వానిస్తున్నారు. కేవలం ప్రకటన, నిర్ధారణ ఆయన వుద్దేశ్యాలు కావు. ఈ చర్చలో అందరూ పాల్గొనాలి. సాహిత్యచరిత్ర గురించి, సాహిత్యం గురించి ప్రబలంగా ఉన్న అభిప్రాయాలలోని బ్రాహ్మణవాదాన్ని గుర్తించి ప్రక్షాళన చేసుకోవటానికి ఇది సదవకాశం. గురజాడ గురించి రాములు చేసిన ప్రతిపాదనలలో అసంబద్ధత వుంటే వుండనివ్వండి. మొత్తం సాహిత్య చరిత్రనే కొత్త కోణంలో చూడటానికి, నిశ్చల నిశ్చితంగా ఉన్న అభిప్రాయాలలోని అసంబద్ధతను తొలగించుకోవటానికి అది అవకాశం ఇచ్చింది. ఫెమినిస్టు అభిప్రాయాల తొలిరోజుల్లో విప్లవ, ప్రజాతంత్ర సాహిత్యశిబిరాలు అనుసరించిన ధోరణిని, ఆ తరువాత అనివార్యంగా వైఖరి

(తరువాయి 29 వ పేజీ)

# చిగురు చివర అరుణ సముద్రం

— అద్దేపల్లి రామమోహనరావు

ఈ తోటలో నన్ను పాడ వద్దన్నారు
నా పాటతో తమ నిద్ర చెడిపోతుందన్నారు
పాటలోని ప్రతి అక్షరమూ
పక్ష ప్రకంపనల్తో
తమ హృదయాకాశాల్లోకి దూసుకుపోతే
ఆకాశమంతా పాటకి పాదాక్రాంతమౌతుందని
యిక్కడ పాట నిషిద్ధమన్నారు—
తమ జీవన తాళంమీద
పాట తనని తాను ముక్కలు చేసుకోవాలిగాని
తమ జీవనాన్ని తాళం తెరిచి చూపే స్వరాల్ని
ముక్కలు ముక్కలు చేస్తామన్నారు
నా గొంతులో ఊగిసలాడే ప్రకృతి ఒడికి
తమ హృదయ కాలుష్యమేఘాల్ని యంత్రించి విసురుతున్నారు
వీళ్ళకి చిగుళ్ళని చూస్తే రక్తపోటొస్తుంది
చిగుళ్ళని మొదలంటా చిదిమి మట్టిలో పాతిపెట్టడానికి
యినప్పెట్టెల్లో తుపానుల్ని పెంచుతూ ఉంటారు వీరు
కొత్త గాలి తరగల్లో నిలువెల్లా ఊగిసలాడుతూ
తోటలోని చిగుళ్ళన్నీ తమ మధ్య దూరాల్లోకి
నిశ్శబ్దంగా చాచిన తమ హృదయాలతో పునస్సృష్టికోసం
చేతిలో చెయ్యివేసి బృందనాట్యం చేస్తున్నప్పుడు
గాలిదుమ్ము కళ్ళల్లో కొట్టి పారిపోతారు వీళ్ళు—
సమాజంలో ఎటుచూసినా చిగుళ్ళ చిత్రవధ
చిగుళ్ళ చిరునవ్వులమీద చరిత్రరాసే చీకటి కథ—
యిక్కడ చిగురు చేతులు ఆఫీసుల ముందర తిట్లు మోస్తూ
వాహనాల అహంకారాన్ని శుభ్రంచేస్తూ ఉంటై
పాదాలు రిక్షా పెడళ్ళమీద ప్రాణాన్ని తొక్కుతూ ఉంటై
తలలు ఊపిరిపైన బరువుల్ని మోస్తూ ఉంటై
శరీరాలు మరల్లోపడి తిరుగుతూ ఉంటై
చీకటిని నెత్తిన కప్పుకుని
తాగుబోతులకి సీసాల్నీ

తిరుగుబోతులకి ఆడితల్లుల్ని కూడా అందిస్తూ ఉంటై
చెట్లు ఎత్తుకుని లాలించవలసిన చిగుళ్ళు
చెట్లని మొయ్యడం సంస్కృతి మొయ్యలేని దృశ్యం కాదా?
ఏ శూన్య కోణంలోనో కన్నీళ్ళమీద కూర్చుని
తమ ఆకలిని తామే తృప్తిగా తింటున్నప్పుడు
వాళ్ళ కళ్ళల్లో నువ్వూ నేనూ ప్రతిబింబిస్తూ ఉంటాం—
లేలేతగాలి పెదవులు లలితంగా తాకినప్పుడు
ఈనెల పులకరింతల్తో చిరు కదలికల్లో
వలపులు చిగిర్చవలసిన చిగుళ్ళు
యిక్కడ మదించిన పశువుల
కాలి గిట్టలకింద చిరిగిపోతూ ఉంటై—
బండెలవొడ్డి పట్టుకోలేని పశువులు
మళ్ళీ చిగుళ్ళకోసం అన్వేషిస్తూ ఉంటై—
ఈ తోటలోని పచ్చదనాన్ని తుంచుకుపోయేవాళ్ళకి
పాటించే పరమ రోత— వాళ్ళు
అపశ్రుతుల కత్తుల్ని చర్మాలకింద దాచుకుని
దిక్కులేని దోవలవెంట, కళ్ళల్లో అర్ధరాత్రులు తెరుచుకుని
జీవన లయని మేలిముసుగుగా ధరించి పరిగెత్తే సౌందర్యాన్ని
వెంటాడి వేటాడి వేధించే వేటగాళ్ళు—
బ్రతుకులోని శ్రమ సారం పిండిన
సారా ప్రవాహంలో పడి ఈదుకుపోతూ
సుడిగుండాల్ని విసిరి కుటుంబాల్ని కుప్పకూలుస్తూ
భరింపవలసిన వాళ్ళంతా బరువుని గోతుల్లోకి తోసేస్తుంటే
గోతుల్లోంచి అపూర్వ ప్రజా ఉద్యమమై గర్జిస్తూ లేచినస్త్రీమహిళా శక్తి
తన చూపుల మంటల్తో ప్రవాహాన్ని ఎండగడుతున్నప్పుడు
వీళ్ళు మంటల్ని ఆర్పెయ్యడానికి
వ్యాపార జలపాతాల్ని కురుస్తూనే ఉంటారు—
పొద్దున్నే పేపరు మీద కళ్ళు తెరిస్తే
బస్సుల్లోంచి, రైళ్ళలోంచి, పేలిపోయిన భవనాల్లోంచి
చిందర వందరైన కన్నీటి శవాల్ని కళ్ళలోకి విసిరేది వీళ్ళే—
వాకిట్లో పెట్టిన నా స్కూటరెక్కడానికి భయం
దాని కడుపులో బాంబులు దాచారేమో

నా తోటలో విచ్చిన పువ్వును కొయ్యడానికి భయం
పూల రేకుల్లో బాంబులు మడిచారేమో
గుండె గుండెకొక బాంబు దాచుకునే రోజులు రాబోతున్నాయని
నా నలుపుగా ఎడతెగని భయం —

కళా దాహంతో తెరుచుకున్న ప్రజల నోళ్ళల్లో
అసభ్యతా మద్యాన్ని తెరలు తెరలుగా పోసి
వాళ్ళు తెరుచుకోలేని కంటిరెప్పల మీద
తమ శాసన రథాన్ని నడిపింపకు పోయేది వీళ్ళే
నీతి సుషుప్తుల్లోంచి బూటు మనుషుల్ని తయారుచేసేది వీళ్ళే !
వీళ్ళ నిషేధాన్నొరుసుకుని నా పాట పదునెక్కుతుంది
కాలం స్పందించినప్పుడు నా గుండె ప్రతిస్పందిస్తుంది
సమాజం కోరినప్పుడు నా గొంతు పాటై ప్రవహిస్తుంది
ఆకునించి పచ్చదనాన్ని

చిగురు నించి ఎర్రదనాన్ని
ఉద్యమం నించి చైతన్యాన్ని
ఎవరు వేరు చెయ్యగలరో

వాడే నా గొంతు నించి పాటని వేరు చెయ్యగలడు
నా పాట కాండంలోని జీవరసమై సాగి
కొమ్మల్లో ప్రగతి శక్తిగా పొంగి
ఆకుల్లో పచ్చని రాగమై రేగి
పూలలో మనోవికాసమై చెలరేగి
ఫలాలలో ఐక్య భావనగా ఘనీభవించి
చిగుళ్ళలో ఉదయ సంఘర్షణల్ని మెరిపించి
తోటంతటినీ రాగోల్బణంగా నిలుపుతుంది.
నా పాటకి కరగని రాళ్ళన్నీ
కదలని పాదాల్ని మట్టిలో పాతేసుకుని
మరణాన్ని తలలపై మోస్తూ నిలబడి ఉంటై
నా పాటకి పొంగిన హృదయ సముద్రాలు
అలల తెల్లటి అంచుల మీద
ప్రాణ శక్తి రెక్కలు విప్పుకుని
పునస్సృష్టి దిశగా ఎగిరిపోతై.

సాహితీ ప్రియులకు నవోదయ అందిస్తున్న విశేషకానుక

హైదరాబాదు

## శ్రీశ్రీ 83 వ జయంతి సందర్భంగా

---

**1988** నుంచి **1992** దాకా విరసం ప్రచురించిన శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం అయిదు భాగాలు

1. మన గురజాడ .......... **10-00**
2. శ్రీశ్రీ వ్యాసాలు ......... **45-00**
3. శ్రీశ్రీ ఉపన్యాసాలు ..... **40-00**
4. ప్ర.జ. ....... **45-00**
5. వ్యూలు - రివ్యూలు ....... **25-00**

---

రూ. 165-00 ల విలువగల పై అయిదు పుస్తకాలు సెట్‌గా కావాల్సినవారు రూ. 124-00 లు M. O. గా గాని, డ్రాఫ్టుగాగాని పంపితే, పోస్టల్ ఖర్చులకు వి. పి. పి. పెట్టి పంపగలం.

విడిగా పుస్తకాలు కావాల్సిన వారికి 15 శాతం డిస్కౌంట్‌పై పుస్తకాలు పంపగలం. పోస్టు ఖర్చులు అదనం.

నవోదయ బుక్ హౌస్

**3-3-865**

కాచిగూడ చౌరాస్తా

హైదరాబాద్ - **27**

---

గమనిక — పర్‌స్పెక్టివ్స్ పునర్ముద్రణలు వెలువడినాయి.

చలసాని ప్రసాదరావు 'ఇలా మిగిలేం' ★ ఎ. బి. కె. 'పరాధీనభారతం'

---

## "మన గురించి మనం తెలుసుకోడానికి ఉపయోగించే సాధనమే చరిత్ర"

### — డా. వి. యస్. యల్. హనుమంతరావు

('ప్రజా సాహితి' రాహుల్జీ శత జయంతి సంచికను గుంటూరులో
1 - 4 - 93న ఆవిష్కరిస్తూ చేసిన ప్రసంగ పాఠం)

మేధావి, బహుముఖ ప్రజ్ఞాశాలి, మానవ స్వాతంత్ర్య ప్రియుడు, మానవతా వాది ఐన రాహుల్‌పై ప్రచురించిన ప్రత్యేక సంచిక ఆవిష్కరించే గౌరవాన్ని నాకు కల్గించినందుకు కృతజ్ఞతలు.

రాహుల్ రాసిన గ్రంథాలన్నీ హిందీ భాషలో వుండటం వల్ల వాటినన్నిటినీ చదివే అవకాశం నాకు కలుగలేదు. తెలుగు అనువాదంలో "ఓల్గా సే గంగా", 'సింహసేనాపతి, 'ఋగ్వేద ఆర్యులు' అన్న పుస్తకాలు మాత్రం చదివాను.

చరిత్ర అంటే రాజుల, రాణుల యుద్ధాల వివరాలు అన్న దృక్పథం వున్న రోజుల్లో చరిత్ర అంటే అది కాదు— చరిత్ర అంటే ప్రజల జీవన విధానం ఏవిధంగా పరిణామం చెందిందో, ఏ విధంగా రూపొందిందో వివరించేదే చరిత్ర అని రాహుల్జీ చెప్పారు. నాటి నుండి చరిత్ర అధ్యయనంలో ఒక కొత్త వరవడి ప్రారంభమైంది.

సోక్రటీసు **Know Thyself** అన్నాడు. అంటే నిన్ను గురించి నీవు తెలుసుకో అని. అలాగే మన గురించి మనం తెలుసుకోడానికి చరిత్ర తంటే మరొకటి ఏమీ లేదు. అలాగే సమాజంలోని రకరకాల రుగ్మతలు ఎలా ప్రవేశించాయో అర్థం చేసుకోకపోయినా వాటిని తొలగించడం సాధ్యం కాదు.

'ఓల్గా సే గంగా' గ్రంథంలో క్రీ.పూ. 6000 నుండి గాంధీ అహింసావాద ప్రచారం వరకూ సాగిన చరిత్రను కథల రూపంలో రాహుల్ రాశారు.

ప్రాచీన చరిత్ర గల్గిన దేశాలలో భారతదేశం ఒకటి. మన దేశానికి 5000 సంవత్సరాల చరిత్ర వుంది. ఇటువంటి ప్రాచీన చరిత్ర గల దేశాలలో నిరంతరం పురావస్తు పరిశోధనలు జరుగుతూ వుంటాయి. ప్రతి సంవత్సరం కొత్త విషయాలు బయటపడుతూ వుంటాయి. దీనితో పాత సిద్ధాంతాలు, నిర్ధారణలు కొన్ని మార్చుకోవాల్సి వుంటుంది. అలా మార్చుకోకపోతే జాతి పురోగమనం కుంటిపడుతుంది.

'ఓల్గా సే గంగా' తెలుగులో 1950 ప్రాంతంలో వెలువడింది. అప్పటి నుంచి ఇప్పటి వరకు - గత నలభై ఏళ్ళ కాలంలో భారత చరిత్ర గురించి అనేక కొత్త విషయాలు వెలుగులోకి వచ్చాయి.

'ఆర్య' అనే పదం జాతి పరమైనది కాదు. 'పూజ్యుడు, గౌరవనీయుడు' అనే అర్థం ఆ పదానికి వుంది. మన పరిపాలకులను ఆ విధంగా గౌరవించడం మన ఆచారంగా వచ్చింది అంతే. నిజానికి మధ్య ఆసియా నుంచి పచ్చిక బయళ్ళను వెతుక్కుంటూ వచ్చిన పశుపోషణపై ఆధారపడిన తెగవారిని చరిత్రకారులు horse riding barbarians అన్నారు. ముస్లిములు ఏ వృత్తిలో వున్నా వారిని మనం సాయిబు అని పిలుస్తాం. సాహెబ్ అంటే ప్రభువు అని అర్థం. ముస్లిముల పాలనలో ఆ పదం అలా స్థిరపడింది. తెల్లవారిని సాధారణ ప్రజలు దొర అని పిలుస్తారు. ఎందుకంటే వారు మనల్ని పరిపాలించారు గనుక. అలాగే ఇక్కడి స్థానికులపై పెత్తనం చలాయించారు గనుక ఆ తెగవారికి 'ఆర్య' అనే పదం స్థిర పడింది. ఆనాడు వీరు మన దేశంలోనికి క్రమ క్రమంగా ప్రవేశించారు కాని దండెత్తి రాలేదు. వారు తెల్లగా వుండేవారు. గుర్రాల మీద వచ్చారు. 1837లో వాస్కోడిగామా తళ్ళికోట రేవులో దిగితే, అక్కడివారు ఆ దొర దేవలోకం నుంచి దిగి వచ్చాడని పూజలు చేసారు.

ఋగ్వేదంతో సహా వైదిక వాఙ్మయమంతా 'ఆర్యుల' సృష్టికాదు. 'ఆర్య', 'అనార్య' సమ్మేళన సంస్కృతాల సమన్వయ ఫలితమే అది.

బ్రిటీషు చరిత్రకారులు, దంపతులు అయిన ఆర్చిన్, బ్రైట్ (ARCHIN AND BRIGHT)ల పరిశోధన ప్రకారం, "The Vedic literature is the **result of centuries of interaction between the horse riding barbarians who are known as Indo Europeans and the natives".** (ఇండో యూరోపియన్లుగా పిలువబడిన గుర్రపు స్వారీనేర్చిన ఆటవికులకూ, స్థానికులకూ మధ్య కొన్ని శతాబ్దాలుగా సాగిన ప్రతిస్పందనల ఫలితమే వైదిక వాఙ్మయం".)

ప్రముఖ భారతీయ పరిశోధకుడు భండార్కర్ అభిప్రాయంలో కూడా ఋగ్వేదంలోని చాల శ్లోకాలు ఆర్యేతరులైన 'అసురులు' రాసినవే. వృత్తిపరమైన సామాజిక విభజన - కుల వ్యవస్థ, పూజా విధానం, పురోహిత వ్యవస్థ ఆర్యులు హరప్పా నాగరికత నుంచి గ్రహించి మెరుగులు దిద్దారు. మొదటి పూజారి ఐన విశ్వామిత్రుడూ, ఆ తర్వాతి వశిష్టుడూ-ఇద్దరూ ఆర్యులు కారు.

చరిత్రలో కొత్త విషయాలు వెలుగులోకి వస్తుంటే వాటికి సంబంధించిన పాత సిద్ధాంతాలు మార్చుకుంటూ వుండాలి. ఈ మారిన విషయాలు ప్రజలకు చేరాలి.

---

రచయితలపై, పాత్రికేయులపై, మేధావులపై హిందూ మతోన్మాదుల దాడులను ఖండించండి!

# నెత్తుటి నెలవంక

స్నిగ్ధ సౌందర్య చంద్రవంక
మౌన ముగ్ధ మనోహర అలంకారిక మంగళ ముద్ర
సర్వ ఆచ్ఛాదనల్ని కాదని
సర్వ భయాల్ని, భ్రమల్ని కాదని
అగ్ని పుష్పమై విచ్చుకొని
ప్రశ్నల కొడవలై దిక్ దిగంతాల నిలవేసి నందుకు

అవును నిజం
రాహు, కేతు కాలం గదా!
రాజ్యహింస ఋతువు గదా?
కలల జాబిల్లిని
వల విసిరే జాలరిని
నెత్తుటి నెలవంక చేశారు.
మునిగిపోయిన "పుట్టి" సాక్షిగా
వెట్టిలో పుట్టి మట్టిలో కలిసిన గంగ పుత్రుల సాక్షిగా
నలుగురి కోసం కనుమూసిన యేసు వీరుపాట సాక్షిగా
యేడుగురు మట్టి బిడ్డల ఆకాంక్షల సాక్షిగా
ఇప్పుడు చెబుతున్నది ఒకటే
చంద్రవంక దిబ్బ మీదే
నెత్తుటి నెలవంక పదును వొర మీదే
'మీన' మేషాలు లెక్కించకుండా
నిరాయుధుల్ని వధించే మృత్యు రాజ్యాన్ని సంహరించే
వజ్రాయుధాన్ని "సాన" పెడతాం

— చెరుకు సుధాకర్

(నాగార్జునసాగర్ చంద్రవంక దిబ్బ అమరవీరుల సభను S.P. మీనా విచ్ఛిన్నం చేసిన క్రౌర్యానికి రగిలిన నెత్తుటి కవితా గాయం)



# ఆ(వ)కాశవాణి

పుప్పాల కృష్ణమూర్తి

"హల్లో! రేడియో స్టేషనేనా?"

"అవున్సార్ ఎవరు గావాలి?"

"శాస్త్రి లంబోదరం గార్ని పిలుస్తారా?"

"అలాగే లైన్లో వుండండి"

"హల్లో ఎవరూ?"

"నేనయ్యా! రామపురం ప్రెసిడెంటుని గుర్తు పట్టలేదా!"

"నమస్కారం సార్! మిమ్మల్నింత తొందరగా ఎట్లా మర్చిపోతాం సార్! మీ పార్టీ తర్వాత అంత మంచి పార్టీ మళ్ళీ దొరకలేదంటే నమ్మండి సార్! ఓహ్, ఏం పార్టీ. ఎంతయినా మీరు...."

"నేను పార్టీ ఎప్పుడిచ్చానయ్యా?"

"అదేసార్! మీరు ప్రెసిడెంటుగా వున్న ఈ ఐదేళ్ళ కాలంలో మీ గ్రామాభివృద్ధికి మీరు చేసిన సేవ గురించి ఓ పావుగంట ప్రోగ్రాం బ్రాడ్‌కాస్ట్ చేశాం గదాసార్! అప్పాళ్ళ మా స్టేషన్ వాళ్ళందరికీ కలిపి పిక్నిక్‌లో పార్టీ యిచ్చారు"

"ఏమోనయ్యా! ఎప్పుడూ ఎవడెవడికో యిస్తూనే వుంటాను గుర్తుండదు. నీ పేరు కూడా గుర్తులేదు. కాని నువ్వే చెప్పినట్లుందె ఫస్టు రోజు అడ్రస్సు, డైరీలో వుంచేసూ ఫోను చేసిన."

"మీరు పెద్దవాళ్ళు సార్! యిటువంటి చిన్న విషయాలెక్కడ గుర్తుంటాయి. అప్పాళ్ళ పార్టీలో నేనే చెప్పాన్సార్ అడ్రస్సు ఎందులోనయినా మీది జరిగిందాకా పోకదే!"

"మా ఊరు జనమంతా నన్ను తిట్టారు గదయ్యా! నా సొంత రెండెకరాలు ఆక్రమించుకోవాలని గొడవగూడా చేస్తున్నారాయె"

"అలాగా జనం అట్లాగే తిట్టారులెండి మీకున్న ఆస్తిపాస్తులా ఆ వెధవలకి లేవనేకుళ్ళు సార్"

"పోనీలే గాని, ఏం చేస్తున్నావు?"

"ఏదో ఎప్పుడూ పనుంటానే వుంటుందనుకోండి. ఏ పనైనా మీ పని తర్వాతనే గద్సార్. మరోసారి ఇంటర్వ్యూ యిస్తారా? ప్రసారం చేద్దాం!

మీకిది నచ్చకుంటే చెప్పండి సార్. దూరదర్శన్‌లో నా బెస్ట్ ఫ్రండే ఉన్నాడు. కెమెరాతోటి యిద్దరం మీ ఊరొచ్చి, మీ గ్రామాభివృద్ధికి మీరు చేసిన కృషి మీతో అర్ధగంట ప్రోగ్రాం టి.వి.లో ఎరేంజ్ చేద్దాం!"

"ఇప్పుడె పట్టుకెళ్తున్నా! [illegible] సాధనాల్ని వాడే సంస్థగా [illegible] టున్నాడని గొప్పగా చెప్తాడు"

"పోనీ.... [illegible] ప్రారంభోత్స వాలు గాని, దేశంలో మీ [illegible] ప్రశంసిస్తూ [illegible] గాని ఏం చెప్పండి సార్. వెంటనే [illegible]! అవి రేడియో ప్రసారం చేద్దాం! వారం పాటు ప్రతి ప్రోగ్రాం మధ్య, విసుగు పుట్టేట్టు రోజుకు పదిసార్లు చెప్పి, ప్రసారం చేద్దాం! రాబోయే ఎలక్షన్లకి చక్కని క్యాన్వాస్‌గా ఉపయోగపడది సార్!"

"ఎలక్షన్లు ప్రకటించాక చూద్దాంలే! ఇప్పుడు నువ్వో చిన్న పని చేసి పెట్టా లోయ్!"

"అయ్యో! చెప్పండి సార్! నేనే గాదు మా స్టేషన్నంతా తెచ్చి మీ ఇంటి ముందల నిలబెట్టమన్నా నిలబెడతాం. ఈ లంబోదరం సంగతి మీకింకా తెలీద్సార్"

"అంత పెద్ద పనేం గాదోయ్! మా వాడీ మధ్య పిచ్చిరాతలు రాస్తూ, పిచ్చి వాళ్ళాగా కనబడ్డ కాగితం మీదల్లా బరికే స్తుండు. అవ్వేవో పద్యాలూ, కవితలం టాడు. నాకేమో వాటి గురించి తెలీదు. అవ్వి మీ స్టేషన్ ద్వారా రేడియోలో వినాలని వాడి కోరిక. ఏ మామూలు మర్చిపోనులే....!"

"ఎంతమాట సార్! అసలు మేమున్న దెందుకు? మీలాంటి వారి మీద ఆలాగా జనానికి భక్తి, గౌరవం ఏర్పడేట్లు చెయ్య డానికే గద్సార్! ఒక్క మీ అబ్బాయి పద్యాలేం ఖర్మసార్! మీరు ఊఁ ... అమెరికాలోనో, [illegible] ఉన్నపిల్లల [illegible] నేర్పిచ్చి [illegible] కార్యక్రమంలో, [illegible] ఉపన్యాసం ఇప్పి [illegible] కోడలొచ్చిందో లేదో తెలీదు [illegible]....ఆఁ....యువ జనుల కార్యక్రమంలో రచయిత్రిగా పరి చయం చేసి కథలో, కథానికో చదివిస్తాం"

"మా కోడలుకు సరిగా చదవడమే రాదు గదయ్యా!"

"[illegible]ండి సార్ మీరు మరీనూ. మేము రచయిత్రంటే రచయిత్రి, సోషల్ వర్క రంటే సోషల్ వర్కరే. ఎవ్వడు చూడొ చ్చాడేం? అందుకని సార్ విలేజ్ డెవ లప్‌మెంటల్ యాక్టివిటీస్ మీద ప్రోగ్రాం ప్రసారం చేస్తాం! ఇదో మాట, నిజంగా [illegible]?"

"పాపం..! నీకు స్టేషన్ డైరెక్ట రయ్యే లక్షణాలున్నాయయ్యా! టీ.వి.కి ప్రమోషనొచ్చినా ఆశ్చర్యం లేదు"

"అదంతా మీ దయ సార్!.... ఈ మధ్య వారపత్రికలు చదివిన ప్రతివాడూ [illegible] రచయితనై పోవాలని, నానా చెత్తరాసి మా మొహాన తగలెస్తున్నారు. కొత్త చెత్తపుస్తే వాడిదే చూసి, కొంచెం అయినా, ఇటు మార్చి రికార్డు చేస్తాం! ఎవడన్నా విమర్శిస్తూ ఉత్తరం రాసినా, మాకెట్లాగూ విమర్శలు చదివే అవకా శమే లేదుగదా వెంటనే చింపి చెత్త బుట్టలో వేసేస్తాం! ఒకవేళ చదివినా, విమర్శ ముందు చదివి, తర్వాతో ఐదారు ప్రశంసలు చదివి, విమర్శిస్తూ రాసినోడ్ని దెబ్బకు ఫూల్‌ని చేస్తామనుకోండి. ఇహ

వాడు జన్మలో రేడియో జోలికి రాడు.

"అవ్వన్నీ తర్వాత ముందు వాడి సంగతి జూడు. అన్నట్లు నేనుండను. యిందాకే మినిష్టర్నుంచి ఫోనొచ్చింది మా వాడికి చెప్పాను. మీ ం తక్కువ గానీడు."

"చిత్తం! నమస్కారం సార్! ఇప్పుడే వస్తున్నా!"

* * *

"చూడు వెంకటేశ్వర్లూ! డబ్బున్న ప్రతివాడికి యిదో వీక్ నెసయ్యా! నానా గడ్డితిని సంపాదిస్తారు. జనానికి వీళ్ళంటే ఘస్తే పడదు. కాని జనం చేత గొప్ప వాడనిపించుకోవాలని తెగ తాపత్రయ పడతారు. పేపర్ల ద్వారా, రేడియోల్లో ప్రజల్నుద్ధరిస్తున్నట్లు ఫోజులు పెడ్తుంటారు. ఈ వీక్ నెస్‌ని మనం క్యాష్ చేసుకోవడం నేర్చుకోవాలి. యిలాంటివాళ్ళతో కొంత పరిచయాలు పెంచకోవాలి. ఓ నలుగురు చేతిలో వుంటే చాలు జేబులో డబ్బులొదలకుండా ఖర్చులు వెళ్ళిపోతుంటాయి...." కారులో వస్తున్నంతసేపూ అసిస్టెంటుకి, ఆఫీసర్ గీతోపదేశం లెవల్లో బోధిస్తూనే వున్నాడు.

జమీందారి గడిముందు కారాగింది. లంబోదరం వెనక పాతికేళ్ళ కుర్రాడు, మెడకో సంచి తగిలించుకుని, చేతిలో మైక్రోఫోను పట్టుకుని దిగాడు. తెలుగు లిటరేచర్‌లో యం.ఫిల్ చేస్తూ, పార్ట్ టైం చేస్తే నాలుగు పైసలన్నా వస్తాయని కొత్తగా స్టేషన్‌లో చేరాడు యింతే ప్రోగ్రాం రికార్డుచేసిన అనుభవం లేమ. ట్రైనింగ్ కోసమని వెంట బెట్టుకొచ్చాడు యాభయ్యేళ్ళ లంబోధరం.

"నమస్కారం సార్! మీ కోసమే ఎదురు చూస్తున్నాము" అన్నాడో ముప్ఫయ్యేళ్ళ వయసున్న, టక్ చేసుకున్న యువకుడు కారు దగ్గరి కురికొచ్చి.

"మైడియర్ బోయ్...." అనో నిమిషం కండ్లు మూసుకుని రెండు చేతులూ భుజం మీదేసి, "నీ ముఖంలో సరస్వతి తాండవిస్తుందోయ్! పద్యాలేం ఖర్మ! నన్నయ్యలాగా కావ్యాలే రాసి పడేయగలవు. నీ ముఖంలో ఆ కళుంది" రెండు భుజాలు ఊపేస్తూ అన్నాడు.

"సారీసార్! నేను వారి ఆస్తి వ్యవహారాలు చూసే సెక్రటరీని! వాళ్ళబ్బాయి లోపల మీ కోసం స్పెషల్ ఎరేంజ్ మెంట్సు స్వయంగా చూస్తున్నాడు" అన్నాడు కాస్త సిగ్గుపడుతూ.

"ఆఁ..! నా ఎక్స్‌పెక్టేషన్ తప్పెప్పుడూ కాదు. నువ్వు వారపత్రికలు చదువుతుంటావు కదూ!" అన్నాడు జారిపొయ్యే ఫాంట్‌ని పైకి లాక్కుంటూ.

"లేద్సార్! నా కస్సలు చదవబుద్ధి గాదు. సినిమా బొమ్మలు మాత్రం చూస్తాను" అన్నాడు వినయంగా.

"ఆఁ....! అదే నేను ఎక్స్‌పెక్ట్ చేసేది. నువ్వు సినిమాలు గూడా చూస్తుంటావు గదూ!"

"అవున్సార్! రండి లోపలకెళదాం!" ముందుకక్కదిలాడు శంభు ప్రసాద్.

చెట్టుమీద నుంచి 'కా! కా!' అనటుస్తున్న కాకి వైపు సాలోచనగా చూసి, వెనకే కదిలాడు వెంకటేశ్వరు.

చిన్న రైల్వే ప్లాట్ఫారం మంతున్న వరండాలో, పడక్కుర్చీలో రిలాక్స్‌గా కూర్చున్నారు.

"నమస్కారం సార్! నా పేరు సాంబశివరావు" సుఖంగా తిని పెరిగిన శరీరం, ఫాంలో పెరిగిన బిల్లానున్నగా లావుగా ఎర్రగా వున్నాడు. కష్టం కన్నెరగని ఊబ శరీరం.

గుడ్లు మిటకరిస్తూ, ఈ యింట్లో ఎవరు ఏంటో తెలియకుండా మాట్లాడకూడదనుకుని సైలెన్స్‌గా చూడసాగాడు లంబోదరం.

"ప్రెసిడెంటు గారబ్బాయి! వీరి గురించే మీకు ఫోను చేసి చెప్పింది" చెప్పి లోపలి కెళ్ళాడు ప్రసాద్.

"చూస్తున్నా........! చూస్తున్నా....! 1970లో రేడియో స్టేషన్ కొచ్చినప్పుడు విశ్వనాథ ముఖంలో కనబడ్డది. మళ్ళీ నీ ముఖంలోనే చూస్తున్నా సరస్వతిని. మీకు నాలుగైదేళ్ళల్లో కేంద్ర ప్రభుత్వం అవార్డు రాకుంటే నాతోటి మాట్లాడకండి. రామాయణం వంటి పెద్ద పెద్ద కావ్యాల్నే రాసే యోగముంది మీలో"

బిడియ పడుతూ, అనీజీగా కుర్చీలో కదిలాడు. "నాకు పద్యాలు, రాయడం రాదండి. ఏదో కవితలు రాస్తున్నానంతే"

"పద్యానికీ, కవిత్వానికి అట్టే పెద్ద తేడా లేదు. నేను చెప్పినట్టు ఫాలో అయితే, మిమ్మ అంతటి గొప్ప కవిని చేస్తాను." దర్పంగా ఒళ్ళు కదిలిస్తూ అన్నాడు.

"కృతజ్ఞుడ్ని. ఆ విషయాలు తర్వాత మాట్లాడుకుందాం! ముందు టిఫిన్ చేసి."

డైనింగ్ హాల్లోకి అడుగు పెట్టారు. భోజనశాలా? మొగలాయిల మందిరమా? అనో క్షణం ఆశ్చర్యపోయాడు అసిస్టెంటు. టేబిల్ మీదున్న జీడిపప్పు మిఠాయి, నాలుగు రకాల టిఫిన్లు, ఇంకో రెండు స్వీట్లు చూసి కండ్లు చెదిరాయి. అన్నింటి కంటే ఆశ్చర్య పరిచింది టిఫిన్‌లో మటన్ ఫ్రై, విస్కీ బాటిల్లుండటం.

పక్కనవుల్తూ, పొర్ర మీద చొక్కా తీసేసి, కుర్చీలో వెనక్కువాలాడు. పక్కనే అసిస్టెంటు కూర్చున్నాడు. అంతలో పాండు వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

"ఆల్ రైట్! యింక స్టార్ట్ చేద్దామా? అన్నట్లు మీ వయసెంతుండొచ్చు" అన్నాడు పాండు ముఖంలోకి చూస్తూ.

"మొన్నటి ఆగష్టుకు ముప్పైఆరు సారు."

"వ్వాట్ అంతుంటుందా మీకు? నేను పాతికనుకుంటున్నా! అట్లా అన్పించరు... ఆఁ .. యువజనుల కార్యక్రమంలో మీ ప్రోగ్రాం ఎరేంజ్ చేస్తా! ఎనీ అబ్జెక్షన్? కావాలంటే మళ్ళోసారి జనరల్‌గా 'కవితా ప్రవాహం'లో ప్రసారం చేద్దాం.

"మీ యిష్టం. మీకెలా వీలైతే అలా" సిన్సియర్‌గా చెప్పాడు.

"సాత్! యువజనుల కార్యక్రమంలో

మనం 18-30 సంవత్సరాల మధ్య వయసున్న వాళ్ళకి అనౌన్సు చేశాం గద్సార్. ముప్పైలరు అంటున్నారు...." డైలమాలో ఆగిపోయాడు అసిస్టెంటు.

"ఎవ్వడు పట్టుకుంటాడయ్యా! మనం అరవయ్యేళ్ళ వాడ్ని పట్టుకుని, 'చుక్ చుక్ రైలు వస్తోంది' పిల్లల కార్యక్రమంలో పాడిస్తే ఆరేళ్ళ చిన్న పిల్లవాడే పాడాడనుకోవాల్సిందే. నువ్వింకా చాలా నేర్చుకోవాలోయ్........ యింక కానీయండి జానపద గేయం పాడ్తారా" పిన్ సంచిలోంచి తీసిన తేపులో గుచ్చి మైక్రోఫోను చేతిలోకి తీసుకున్నాడు.

"నాకు అవ్వీ పాడటం రాదు! కవితలు చదువుతానంతే."

"ఓఁ.... అవునుగదూ. కమాన్ చెప్పేయండి" మైక్రోఫోను ముఖం ముందు పెడుతూ అన్నాడు.

"నోటికి రావు! లోపలున్నాయి పట్టుకొస్తాను" లేచాడు.

"ఎలాగోయ్ పాండూ! కవితలుకూడా కాగితాలు చూసి చదవాల్నా? చూసిన ప్రతి దృశ్యం మీద, వస్తువు మీద అలా గల గలా ఆశు కవిత్వం చెప్పేయాలి. కమాన్ బొయ్యిరా!"

లోపల్నుంచి కాగితాలు నాలుగు పట్టుకుని వచ్చాడు.

"పాండు గారూ! మీ కవితలు ఏవీ పత్రికల్లో ప్రింటయ్యాయండి" అడిగాడు అసిస్టెంటు.

"అబ్బేఁ... లేదండి!" అని అదో మాదిరిగా నవ్వాడు.

"ఏం? ఎందుకని? పత్రికల కింత వరకూ పంపలేదా? లేకుంటే పంపినా ప్రింటు గాలేదా?"

"పత్రికలకా.... పత్రికలకు పంపానండి! కాని వారం గూడా తిరక్కుండానే తిరిగొచ్చాయి" కాస్త సిగ్గుపడ్డాడు.

"వెంకటేశ్వర్లూ! పత్రికల వాళ్ళు వేసుకునేంత స్టాండర్డ్ వుంటే మనం దేనికయ్యా! వాళ్ళలాంటి కొత్తవాళ్ళవి వేసుకోరు. గాబట్టే మనం ప్రసారం చెయ్యాలి. నువ్వింకా చాలా నేర్చుకోవాలోయ్" అన్నాడు.

"సార్! మనం కవితల్ని స్టుడియోలోనే రికార్డు చేస్తాం గద్సార్! యిలా అవుట్ డోర్ లో చేస్తే సౌండ్ ఎఫెక్ట్స్ అవ్వీ, ప్రోగ్రాం క్లియరుండదేమో?"

"నువ్వు నోర్మూయ్! బాబుగారంటే ఏమనుకున్నావు. జమీందారు బిడ్డ. అందర్లాగా స్టుడియోకి రావడమేంటి? స్టుడియోనే ఆయన దగ్గరికొస్తుంది. ఎలాంటి ఎఫెక్ట్ లేకుండా నేస్తూస్తాగా! నువ్వు.... నా అంత ఎప్పుడు ఎదుగుతావు? ఊఁ.... కమాన్."

నాలుక్కాగితాలు తిరగేసి, అందులోంచి ఓ కాగితం తీసి, గొంతు సవరించుకుని, గంభీరంగా అయిపోయి, కుడి చెయ్యి పైకెత్తి మబ్బుల్లోకి చూడసాగాడు.

"మీరు మామూలుగా కూర్చుని చదివితే సరిపోతుంది. దూరదర్శన్ కాదుగా ఫిగర్ కనబడ్డానికి" మెత్తగా అన్నాడు అసిస్టెంటు. కాని పాండులో ఏం మార్పు లేదు. క్రమేపీ కోపంగా చూడసాగాడు.

"ఏంటట్లా టెన్షన్ తోటి బిగుసుకు

పోతున్నావ్. కొంపదీసి విప్లవం కవిత్వం చదువుతున్నావా?" అందోళనగా చూశాడు ఆఫీసర్ పాండు ముఖంలోకి.

"అవును. విప్లవ కవిత్వమే! విప్లవ మంటే నాకు ప్రాణం కూడా!"

"వామ్మో...! నువ్వు కొంపముంచే ట్లుంది గదయ్యా! అటువంటివి మా స్టుడియో దరిదాపుల్లోకూడా రాకూడదు. ఏదన్నా గోడమీదనో, కొమ్మ మీదనో చెప్పరాదూ! నే చెప్తున్నా చూడు" చేతులు గాల్లోకి ఎత్తి, క్రైస్తవులు ప్రార్థన చేసే పైపులో నిలబడి, చేతు లూపుతూ-

"గోడా! ఓ గోడా!
మనిషికి నీడనిచ్చే గోడా!
ఎన్ని యిటుకలు, ఎంతసున్నం
ఎంత నీటిని పీల్చుకున్నావో,
ఎన్నివానల తడిసి నిలిచావో!
గోడా! ఓ సున్నం గొట్టిన గోడా!"

"ఇట్లా ప్రాణం లేని వస్తువుల మీదనో చిలకలు వాలిన చెట్టు మీదనో, కుక్క కాలెత్తి ఉచ్చబోసే ఒక రాయి మీదనో కవిత్వం చెప్పాలె! ఈ మధ్య అట్లాంటి కవిత్వాలె ఎక్కువ రాస్తున్నారే! నువ్వు చూడట్లేదూ? వాటినే కొంతమంది పని గట్టుకొని మంచి కవిత్వం అంటున్నారు గూడా! యిలాంటి వయితే మాకేటువంటి అభ్యంతరం వుండదు! చక్కగా ప్రోత్స హిస్తాం గూడా."

బుర్రగోక్కున్నాడుపాండు. "అలాం టివి రాయలేదండి. విప్లవ కవిత్వం రాసిన వాళ్ళే గొప్ప వాళ్ళని ప్రజలు, పత్రికలూఅంటుంటే అదే రాశాను."

"ఊఁ... సరే చదువు ముందు. విందాం!" టేప్ ఆన్‌చేసి తల ఊపాడు.

"విప్లవం" అన్నాడు గొంతు సరాయించి పాండు.

"ప్రేయసి చెక్కిళ్ళంత నునుపైనది
విప్లవం
ప్రేయసి కాలిగోళ్ళ కాంతిలా విప్లవం
విప్లవం! విప్లవం!!
విప్లవం నా గుండె! విప్లవం నా
ప్రేయసి!!
నా హృదిలో దూరి నిద్రపోనీదు
విప్లవం,
నా పడక మీద చేరి నిద్ర పోనీదు
విప్లవం
విప్లవమా!
నా యింటి ముందు సంక్రాంతి
ముగ్గులో ముడుచుకున్న విప్లవమా!
లే కన్నెపిల్ల బుగ్గలోని సిగ్గులా పల్ల
వించే విప్లవమా!!"

తన్మయుడైన ఆఫీసరు "ఓహో! ఓహోహో! బ్రహ్మాండంగా ఉందోయ్! యిలా వుండాలే కవిత్వ మంటే. నువ్వు విప్లవ కవిత్వమనేసరికి చెరబండరాజు లాగో, గద్దర్‌లాగో రాశావనుకుని భయ పడ్డా! కాని యింత మెత్తగా, యింత అందంగా, అహ్లాదంగా విప్లవం గురించి చెప్తావనుకోలేదు. ఎంతైనా మీరు కష్టం కన్నెరగని జమిందారు బిడ్డలు. అందుకు తగ్గట్టే చెప్పారు సంతోషం. దీన్ని ప్రసారం చేద్దాం." అన్నాడు. "ఈ మధ్య ఒకాయన యిలాగే కవిత్వం రాసి, శ్రీశ్రీ కంటే నాదే గొప్ప కవిత్వం అన్నాడు గదండి. ఆయన్నే చాలామంది

భజన కవులు, ఒకటి, రెండు పత్రికలు కడుపులో కాక్‌టెయిల్‌ని మోసినట్లు మోశారు గూడా" అన్నాడు అసిస్టెంటు.

"నీకు నోటికొచ్చింది అనేడమేనా?" అసిస్టెంటు వైపు కోపంగా చూసి, పాండు వైపు ప్రసన్నంగా జూస్తూ "మీరు పత్రికా ఎడిటర్లతోటి సాంగత్రం దోస్తానా చెయ్యండి. మీకు వొంచి భవిష్యత్తుంది కవిత్వంలో." భుజం మీద చరుస్తూ అన్నాడు లంబోదరం.

"సంతోషమండీ! పత్రికలకు సమీక్షలు రాసే వెధవొకడున్నాడిక్కడ. వాడు నాది 'కవిత్వమే కాద'న్నాడు రాస్కెల్. 'ముందు నువ్వు మహాప్రస్థానం చదవ'మని, సలహా యిచ్చాడు. బోడి కవిత్వం రాయడానిక్కూడా పుస్తకాలు చదవాలండీ?

"అబ్బే! అవసరం లేదు. నేను మాత్రం చదివి చస్తానా! మీబోటి వారికి అస్సలే అవసరం లేదు. కాస్త డబ్బు విదిలిస్తే చాలు. కవులు, పత్రికలు మీ యింటి ముందుకొచ్చి, చూరు పట్టుకుని వేలాడతారు. కాస్త డబ్బు మనది కాదనుకుంటే, మీకు 'కలవృషభో!' 'కవి గండభేరుండమో' యిప్పించే పూచి నాది."

"చాలా థాంక్సండి. యిందులో ఇన్ని కిరకాసులుంటాయని నాకస్సలే తెలీదు" చేతులు నలుపుకుంటూ అన్నాడు.

"ఎలా తెలుస్తుంది? పల్లెటూళ్ళో ముక్కు మూసుక్కూచుంటే? అలా నగరానికి వచ్చి చూడండి. కవిత్వమంటే తెలవనోడు రేపీపాటికల్లా టన్నుల కొద్దీ రాసేసి, సన్మానాలు చేయించుకుంటుండు. కథ గూడా రాయడం చేతకానివాడు డైరెక్టుగా సీరియల్ రచయితై పోతుండు. బొయ్య బొమ్మల గురించి తెలవనోడు, 'కళామిత్ర' బిరుదుల్తో ఊరేగుతుండు. నీకు డబ్బుకు కొదవలేదు కాబట్టి గొప్ప కవివై పోతావు, తిరుగులేదు. ఎటుకూడి పత్రికలవోళ్ళ దార్లన్నీ తెలవాలె. నేనున్నాగా అవన్నీ చూసుకోవడానికి" ధైర్యం చెప్పాడు.

"మీరు చెప్పేదంతా నాకు చాలా విచిత్రంగా అన్పిస్తోందండీ! ఏమైనా నా భారం మీది....మీ ఋణం గూడా ఉంచుకోను.... సరే! ఇంకో కవిత చదువుతాను. ప్రేమ మీద"

"ఓహోహో! ప్రేమ మీదా! ప్రేమ మీద రాసే కదండీ కృష్ణశాస్త్రి అంత గొప్ప కవై పోయింది. డ్రైనేజీలో పురుగు పారినట్లు, ఎంత ప్రేమకవిత్వం చెప్పినా మాకేం అభ్యంతరముండదు. ఊఁ....కానీ !"

"నర్సూ! నువ్వే నా మనీపర్సు.
నువ్వంటే ఉండదు నాకు కర్సు.
నువ్వు ఊఁ అంటే మన బ్రతుకంతా
ఛీర్సు
మనల్నేదో అనుకుంటారు లోఫర్సు
నిజంగా మన ప్రేమెంత రొమాన్సు

"ఆహా! ఏం కవిత్వమండి! అసలీ నర్సు మీద ఇంత బ్రహ్మాండమైన కవిత్వం రాయటానికి కారణమేమంటారూ" ఆసక్తిగా అడిగాడు ఆఫీసర్.

"చెప్పమంటారా? నా పెండ్లి కాక

మూడవ సంగతి డిసెంబర్ 31 నైట్ 'న్యూ ఇయర్ పార్టీ' ఓడ్‌లాండ్స్ గార్డెన్‌లో అయింది. నషా మోతాదు మించింది. ఇంటికొస్తుంటే యాక్సిడెంట్. హాస్పిటల్. అక్కడితో నెల్రోజులు బెడ్ రెస్టు. అప్పుడే ఆ హాస్పిటల్ నర్సు సరోజతో పరిచయమైంది. తర్వాత కలిసి తిరిగాం. చాలా చాలా చేశాం. కాని పెండ్లికి మా నాన్న ఒప్పుకోలేదులెండి. ....—అదో విషాద గాథ.........!" అన్నాడు నిట్టూరుస్తూ.

"చాలా ఇంట్రెస్టింగ్ స్టోరీ! కవిత కూడా బావుంది. వీలయితే 'కవి నిజ జీవిత వ్యథార్థ స్పందన' అని కూడా చెబ్దాం. ఇంకొక్కటయితే బావుంటుంది. పదిహేను నిమిషాల ప్రోగ్రాం ఎరేంజ్ చేశాము. మీరింకోటి చదివితే ప్రోగ్రాం ఫినిష్ చేద్దాం!"

అప్పటికే అక్కడ కూర్చుని మూడు గంటల పైనయింది. అదనంగా రెండు సార్లు టిఫిన్లూ, నాలుగు సార్లు కాఫీలు అయిపోయాయి. మాట్లాడితే ఏమంటాడో అని సైలెన్స్‌గా చూస్తున్నాడు అసిస్టెంటు.

"యిప్పుడు ఎలాంటి కవిత చదవ

"మర్చిపోయ్యాను. దేశభక్తి కవిత చెప్పండి! అలాంటి కవితలు చెప్పడం పెద్ద ఫేషన్‌లెండి. మీకు ముందుముందు రేడియో, టి. వి. కవి సమ్మేళనాల్లోకి ఆఫర్స్ రావొచ్చు. ప్రభుత్వం నుంచి అవార్డులు కూడా వాటి వెనకాలే వస్తుంటాయి" సంతోషంతో ఊగిపోతూ

"దేశభక్తి....కవిత్వమంటే........? గంగా, యమున, కృష్ణా నదుల్ని; నన్నయ, తిక్కన కవుల్ని, మహాప్రాచీన చక్రవర్తుల్ని కీర్తించడమే గదండీ?"

"అబ్బా ... !" అని తల పట్టుకుని, "అదంతా పాతకాలంనాటి దేశభక్తయ్యా! ఇప్పుడు దేశభక్తంతా మోడ్రనైపోయింది. రాజకీయ నాయకుల్ని, వాళ్ళు ప్రవేశపెట్టిన సంక్షేమ పథకాల్ని, యింకా స్వాతంత్ర్యం కోసం పోరాడిన సమర యోధుల్ని కీర్తించడమే మోడ్రన్ దేశభక్తి."

"ఆగండి! యింక చెప్పనవసరం లేదు. సుభాష్‌చంద్రబోస్, భగత్‌సింగ్‌ల మీద కవిత్వం రాశా వినిపిస్తా!" అన్నాడు ఉత్సాహంగా కాగితం చూస్తూ.

"అమ్మా ...! చ ం పు తు న్నా వు గదయ్యా! స్వాతంత్ర్యం కోసం పోరాడిన నాయకులంటే నెహ్రూ, ఇందిరా గాంధీల మీద. రాజీవ్‌గాంధి మీదయితే యింకా మంచిది. లేటెస్టుగా అంతా రాజీవ్‌గాంధి మీదే రాస్తున్నారు. గాంధీ అంటే మేమంతగా పట్టించుకోవడంలేదు అయినా ఫర్వాలేదు. నేను ట్రై చేసి ఒప్పిస్తా" అభయమిస్తున్నట్లుగా అన్నాడు.

"అదేంటి సార్! అస్సలు స్వాతంత్ర్యం తెచ్చింది గాంధే గద సార్. నెహ్రూ ఆయన అనుచరుడు మాత్రమే నాయె?" అర్థంగాక అడిగాడు వెంకటే

"నీకు తెల్వదు లేవయ్యా! మనదసలే కేంద్ర ప్రభుత్వంతో ప్రత్యక్ష సంబంధాలున్న కీలక సంస్థ. కేంద్రంలో ఏ పార్టీ

అధికారంలో వుండే ఆ పార్టీ చెప్పినట్లు వినాల్సిందే! ఏదెప్పుడే ఏం రాయాలో తెల్వదు. నన్ను జూసి నేర్చుకో. పైకొస్తావు" కోపంగా అన్నాడు.

"నెహ్రూ, ఇందిరాగాంధీల మీద ఏం కవితలు రాయలేదండి. అయినా మీ రేడియో స్టేషన్‌కు ఆలోచించి రాయనవసరం లేదనిపిస్తోంది. ఆన్ చెయ్యండి. 'గులాబీల నెహ్రూ' కవిత పేరు.

"ఓ మా ప్రియతమ నెహ్రూ
ఎర్రగులాబి వంటి నెహ్రూ
పట్టుకోటు తొడిగావు
జనానికి పువ్వు....సారీ
కోటుకు పువ్వు పెట్టావు.
జనానికి ప్రధాని వయ్యావు.
ప్రణాళికలను చేపట్టావు.
గులాబీలా నీ అందం మనోహరం.
మల్లెలా నీ పలుకులు సుమధురం.

'చాలండి చాలండి బాబూ యింక ఆపండి. యిప్పటికే ముప్పై లైన్లు దాటిపోయింది. టైమ్ ఎక్సీడ్ కాకుండే కట్ చేయాల్సుంటుంది" అన్నాడు ఆఫీసర్.

"టైమ్ ఎడ్జస్ట్‌మెంట్ చెయ్యండి. నా కవితలు కట్ చేయడమేంటి?"

"ఆ ఎస్.డి. గారూరుకోడు సార్!" వినయంగా సమాధానం చెప్పాడు.

"ఏం వాడు? మనముందుపుట్టుకోడా?" అధికారికంగా అన్నాడు.

"పుట్టుకుంటాడనుకోండి.... కాని కవితలకు మొదట్నుంచే పావుగంటే కేటాయిస్తున్నాం. మీగురించి ఎక్సెప్షన్ చేస్తే అదే కంటిన్యూ చేయాల్సొస్తుంది. అట్లా టైమెందుకు మార్చారని మామీది వాడు....? మీరెందుకు సార్! నెల్లోపల యింకోసారి మళ్ళీ పావుగంట ప్రోగ్రాం ఎరేంజ్ చేసే పూచీ నాది. సరేనా?"

"సరే మంచిది చూస్తాం! ప్రసాదూ! లంచ్ ఎరేంజ్‌మెంట్స్ చూడు." పురమాయించాడు అప్పటివరకూ నిలబడి ఓపిగ్గా కవితా పఠనం విన్న ప్రసాద్‌ని. ●

---

ఆంధ్రప్రదేశ్‌లోని మహిళోద్యమ చరిత్రను 1989 వరకు వివరిస్తూ మల్లాది సుబ్బమ్మగారు రాశారు. దీనిని ఇంగ్లీషులో ప్రచురించబోతున్న సందర్భంగా 1992 సంవత్సరం వరకూ మహిళా ఉద్యమాల, మహిళా సంఘాల కార్యక్రమాలతో కూడిన సమాచారం కూడా చేర్చాలనుకుంటున్నారు. తమ తమ మహిళా సంఘాల గత పదేళ్ళ చరిత్రను సంక్షిప్తంగా తెలియ చేయవలసిందిగా మహిళా ఉద్యమ నాయకులను, అభిమానులను రచయిత్రి కోరుతున్నారు. జూన్ 93 లోగా ఈ క్రింది చిరునామాకు ఆ సమాచారం పంపించండి.

మల్లాది సుబ్బమ్మగారు, ఎడిటర్ 'స్త్రీ స్వేచ్ఛ'
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహదీపట్నం
హైదరాబాదు-500028. ఫోన్స్ : 35429 - 220156

# బి. వి. సుబ్బయ్యా రెసిడెన్షియల్ కాలేజి & స్కూలు

## పేర్నమిట్ట - సంతనూతలపాడు మండలం
## ప్రకాశం జిల్లా

సమాజ శ్రేయస్సే వ్యక్తి శ్రేయస్సు - ఈ సూక్తియే మా సకల కార్యక్రమాలకు మార్గదర్శకం.

విద్యార్థి శ్రేయస్సే ఈ సంస్థ ఏకైక లక్ష్యం.

1. ఇంటర్మీడియట్ రెండు సంవత్సరములు మేము ఇచ్చు, వివరమైన. లోతైన, పటిష్టమైన శిక్షణ ద్వారానే విద్యార్థి నేరుగా EAMCET పరీక్ష రాయగలడు.
2. 1992-93 లో మా కళాశాల విద్యార్థికి స్టేషనరీతో సహా అన్ని అవసరములు రు. 10,500/-తో తీరినవి.
3. EAMCET పేరుతో అదనపు ఫీజు వసూలు చేయము.
4. 10th లో ప్రధమశ్రేణి విద్యార్థులకు మాత్రమే ప్రవేశము.
5. 6, 7, 8, 9, ఇంటర్మీడియట్ తరగతులకు మాత్రమే ప్రవేశము కలదు.
6. 10వ తరగతి 1993 మార్చి పరీక్ష ఫలితముల శాతము 92.4

బి. వి. సుబ్బయ్యా,
నిర్వాహకుడు.



# ఉత్తమ కథల సంకలనం

— నవీన్

కథకు చాలా మంచిరోజులొచ్చాయని చెప్పుకుంటున్నారు. 1990లో వెలువడిన కొన్ని మంచి కథల్ని ఎంపికచేసి కథాసాహితివారు ప్రచురించిన "కథ 90" అన్న ఈ సంకలనంలోని కథల్ని చదివితే ఆమాట నిజమే అనిపిస్తుంది. వాసిరెడ్డి నవీన్, పాపినేని శివశంకర్ ఈ కథా సంకలనానికి సంకలన కర్తలుగా వ్యవహరించారు.

"జీవితాన్ని, సమాజాన్ని సీరియస్‌గా తీసుకొని కథలు రాసే రచయితలు ప్రోత్సాహంలేని కారణంగా రాను రాను తగ్గిపోతున్నారు. ఇంత ప్రతికూల వాతావరణంలోనూ అప్పుడప్పుడు వచ్చే కథలు గుర్తింపు లేకుండా రొడ్డలో కలిసిపోతున్నాయి. అలాంటి కథలను గుర్తించే ప్రయత్నమే యీ సంకలనం" అని ఈ పుస్తకాన్ని ప్రచురించిన ప్రచురణకర్తలు చెప్పుకున్నారు. కథా సాహిత్యాన్ని సీరియస్‌గా తీసుకునే తెలుగువాళ్ళందరూ కథాసాహితివారి ఈ ప్రయత్నానికి హృదయపూర్వకంగా తోడ్పడాలి.

ఈ సంకలనంలో మొత్తం పదిహేను కథలున్నాయి. మధురాంతకం రాజారాం లాంటి సీనియర్ మోస్ట్ కథకుని కథ, శ్రీపతి, కేతు విశ్వనాథరెడ్డి, పి. సత్యవతిలాంటి సీనియర్ కథకుల కథలు, సుమనస్పతి, సాకి, గోపిలాంటి వర్తమాన కథకుల కథలు ఈ సంకలనంలో చోటుచేసుకున్నాయి.

ఈ కథల్లో ఎక్కువగా ఆంధ్రదేశపు గ్రామీణ ప్రాంతాల్లో వస్తున్న అనేక ఆర్థిక, సాంఘిక మార్పులు, మానవీయ సంబంధాల్లో వస్తున్న మార్పులు చిత్రించబడ్డాయి. వస్తువు విషయంలోనూ, శిల్పం విషయంలోనూ ఈ కథల్లో చక్కని సమన్వయం కనిపిస్తుంది.

వద్దన్నవాటికి బిచ్చమడుక్కోవటానికి వెళ్ళి చిత్రహింసలకు గురైన ఓ బడుక్కులవాడి కథ మధురాంతకం రాజారాం రచన 'అంబపలుకు ...' ఆయన రాసిన అనేక ఇతర కథల్లో మాదిరిగానే ఈ కథలో కూడా మొదటి భాగమంతా ఉపోద్ఘాతంతో పే పరిగోతుంది అసలు కథ చాలా ఆలస్యంగా మొదలౌతుంది. సుదీర్ఘ

పైన ఉపోద్ఘాతం లేకుండా సూటిగా కథలో కొచ్చెయ్యటం ముఖ్యాంశంగా రాచ రామ్‌కు తెలీదేమో అనిపిస్తుంది.

శ్రీపతి రచించిన 'ఆటకట్టు' కథలో యునైటెడ్ స్టేట్స్‌లో వుంటూ పాతికేళ్ళ తర్వాత తను పుట్టి పెరిగిన తన స్వగ్రామాన్ని చూడటానికొచ్చిన వేణు గోపాల్ అనుభూతులను చూస్తాం. ఈ పాతికేళ్ళలో ఆ ఊళ్లో ఎన్ని మార్పు లొచ్చాయో చూసి చాలా ఆశ్చర్యపోతాడు. తన తమ్ముడు శంకరరావు అన్యాయంతో పోరాడిన సంజీవునాయుడు వైపుగాని, అన్యాయానికి మూలమైన జగ్గునాయుడు వైపుగాని వుండకుండా తటస్థంగా వుంటూ ఎంత ఆస్తిని సంపాదించాడో తెలుసుకుంటాడు. తను యునైటెడ్ స్టేట్స్ వెళ్ళకుండా తన స్వగ్రామంలోనే వుండిపోతే తను సంజీవునాయుడు పక్షం వహించేవాడినా? లేక జగ్గునాయుడు పక్షం వహించేవాడినా అని తనను ప్రశ్నించుకొని తన తమ్ముడు శంకరరావులాగే తనూ పెద్ద అవకాశవాదినయ్యుండేవాడనని సమాధానం చెప్పుకుంటాడు.

శ్రీపతి కథల్లో నాటకీయత బొత్తిగా వుండదు. అందువల్లనే అతని కథల్లో పఠనీయత తక్కువగా వుంటుంది. అతి నాటకీయత అవసరంలేదుగానీ తను చెప్పదల్చుకున్న అంశాన్ని పాఠకుడిలో బలంగా ఆవిష్కరించటానికి కొంత నాటకీయత అవసరమౌతుంది. కథను కొన్ని దృశ్యాలుగా చిత్రించే నేర్పు శ్రీపతికి లేదు. అందుకే కథంతా ఓ వ్యాసంలా సాగుతుంది. ఉదాహరణకు ఈ కథలో శంకరరావు ఇంట్లో వేణుగోపాల్‌కొక పెద్ద పార్టీ ఇస్తారు. ఈ పార్టీలో పాల్గొన్న వాళ్ళందర్నీ మాట్లాడించటం ద్వారా....అంటే సంభాషణల ద్వారా ఆయా పాత్రల్ని ఆవిష్కరిస్తూ ఈ దృశ్యాన్ని చిత్రిస్తే చదివేవాడికెంతో బావుంటుంది- వీళ్ళొచ్చారు, వాళ్ళొచ్చారని రచయితే చెప్పెయ్యటంవల్ల పాత్రలు పాఠకుడి ముందుకు రావు. సన్నివేశాలు, సంభాషణలు కథను సజీవంగా నిలుపుతాయి. శ్రీపతి కథల్లో ఇవి చాలా తక్కువగా వుంటాయి.

స్త్రీవాద దృక్పథంతో పి. సత్యవతి రాసిన "ఇల్లలకగానే" అనే కథ ఇల్లలుకుతూ పేరు మరచిపోయిన ఈగ కథకు పేరడీ. ఈ కథలో వ్యంగ్యం చాలా చక్కగా పోషించబడింది. స్త్రీకి పెళ్ళయి ఒకరికి భార్యగా మారిపోవటంతోనూ, ఆ తర్వాత కొందరికి తల్లిగా మారిపోవటంతోనూ యే విధంగా తన వ్యక్తిత్వాన్ని అస్తిత్వాన్ని కోల్పోతుందో రచయిత్రి ఈ కథలో చాలా బాగా చిత్రించారు.

సాక్షి అలియాస్ సందిగం కృష్ణారావు రచించిన 'తిరగబడ్డ ధర్మం' కథలో హాస్య వ్యంగ్యం బాగా వుంది. డబ్బున్నవాడు యేం చేసినా, ఎన్ని వేషాలు వేసినా వాడిని సమాజం గౌరవిస్తూనే వుంటుందన్న వాస్తవం ఈ కథలో రచయిత చెప్పాడు. ఆ డబ్బు ఎలా సంపాదించాడన్నది సమాజానికి ముఖ్యంకాదు— ఈ

కథలో ఒక న్యాయవాది తిమ్మిని బమ్మిని చేసి బమ్మిని తిమ్మిని చేసి బాగా డబ్బు సంపాదిస్తాడు—ఆ న్యాయవాదికి గాడిదనెక్కి కోర్టుకెళ్ళాలన్న కోరిక కల్గుతుంది—ఓ గాడిదను తెప్పించి ఆ గాడిదమీదనే అతడు కోర్టుకెళ్తుంటాడు - అయినా అతని క్లైయింట్స్ అతన్ని "గుర్రం ఎక్కితేనేం, గాడిదనెక్కితేనేం! రాజా రాజే అవుతాడని" ఎప్పటిలాగే గౌరవిస్తూనే వుంటారు - అవే పల్లెటూళ్లో ఎవరైనా యేదన్నా తప్పు చేసినవాడిని గాడిదమీదెక్కించి ఊరేగిస్తారు! వంద తప్పులు చేసి సమాజాన్ని బాగా దోచుకొని బాగా డబ్బు సంపాదించిన అడ్వకేట్ గాడిదనెక్కి వూరేగితే "రాజా రాజే అవుతాడని" గౌరవిస్తారు.

"ఇప్పుడూ ఇక్కడ" అన్న పాపినేని శివశంకర్ రచించిన కథలో ప్రతి విలువనూ డబ్బుతో బేరీజు వేసే కుటుంబంలోనే పుట్టిన స్త్రీకి అందుకు పూర్తిగా భిన్నమైన సంస్కారాన్ని కల్గిన నీలిమలోని మానవీయ దృక్పథాన్ని, కళాత్మక హృదయాన్ని రచయిత చాలా గొప్పగా చిత్రించారు.

గోపి రచించిన "ఒక తండ్రి" అనే కథలో ఈనాడు ఉత్తర తెలంగాణా లోని గ్రామీణ ప్రాంతాల్లో చెలరేగుతున్న నక్సలైట్ ఉద్యమం చిత్రించబడింది. ఈ రచన ఒక కథలా కాకుండా నవలలా సాగుతుంది. పోలీసులచేత చంపబడిన తన కొడుకు నిరంజన్ ఇంకా బ్రతికేవున్నాడని అనుకుంటున్న సుగుణమ్మను, తన కొడుకును పోలీసులు చంపేశారని తెలిసినప్పుడు ఈ దేశంలోని కోటానుకోట్ల తండ్రుల్లాగే రోదించిన బుచ్చిరెడ్డిని పాఠకులు మరచిపోలేరు.

సీనియర్ కథకుడు కేతు విశ్వనాథరెడ్డి రచించిన 'తేడా' కథలో శ్రీలత తన భర్త రాఘవకు, తన మరిది దివాకర్‌కు మధ్యవున్న తేడా యేమిటో తెలుసుకుంటుంది. రాఘవకంటె దివాకర్ యే విధంగా వున్నతుడో ఈ కథలో చూపించబడింది. "సిమెంట్ ఫ్యాక్టరీలో పనిచేసే కూలీల శ్రమమీదా, వాళ్ళ సంబంధాల మీదా నాకు నమ్మకం యేర్పడింది. నేనందుకే వాళ్ళతో కలిసిపోయాను." అన్న దివాకర్‌మీద శ్రీలతకు గౌరవం కల్గుతుంది. వైట్‌కాలర్ జాబ్స్ చెయ్యటమే గొప్పగా భావిస్తూ నిజమైన శ్రమ విలువను గుర్తించలేని రాఘవలాంటి అనేకమంది మధ్యతరగతి బుద్ధిజీవుల కళ్ళను తెరిపించే మంచి ప్రయత్నం ఈ కథ.

డబ్బు సంపాదించటానికి సర్వస్వాన్ని— చివరకు తన భార్య శీలాన్ని కూడా అమ్మకానికి పెట్టడానికి సిద్ధంగా వుండే సావిత్రమ్మ మరిదిలాంటి వాళ్ళ కథను "[illegible] సావిత్రమ్మ" కథ చెబుతుంది. వ్యభిచారం చేసి తన వదిన కువైట్ వెళ్ళిందని ఊర్లోంచి వెళ్ళగొట్టిన ఆమె మరిది కొన్నేళ్ళ తర్వాత బాగా డబ్బు సంపాదించి తిరిగొచ్చిన ఆ వదినెనే చూసి ఆమెతో తన భార్యను కూడా కువైట్‌కు

(తరువాయి 46వ పేజీలో)

గంగా నదిలోని సాలిగ్రామాన్ని
మానవ రక్తం చిందించి కడుగుతున్న
మతాల పవిత్రక్షేత్రం సాకేతాయోధ్య
ఏమా. వెలుగొందు సౌభాగ్యం మోము
ప్రేమాను రాగాల
పవిత్ర సీత రూపున్నై
సామరస్యంగా మమ్మల్ని బ్రతకనీయవా దేవా!
అయోధ్య రామా!
అలంకార శ్యామా!
కళ్యాణ రామా! కారుణ్య ధామా!

**మల్లెల నారాయణ**

(43 వ పేజీ తరువాయి)

సంపించటానికి సిద్ధపడ్డాడు- డబ్బు సంపాదించటం అనే లక్ష్యాన్నే సర్వస్వంగా భావించినవాళ్ళు ఎంతగా పతనమైపోతారో చిత్రించే కథ "కువైట్ సావిత్రమ్మ."

అత్యాచారానికి గురైన ఓ స్త్రీ కథను ఎంతో ఆర్ద్రతతో చిత్రిస్తాడు వాడ్రేవు చినవీరభద్రుడు 'సుజాత' అన్న కథలో. ఈ సంకలనంలో చేర్చబడిన కథల్లోకల్లా చాలా బావున్న కథ 'సుజాత', రాజ్యాధికారానికి ప్రతినిధులైన పోలీసులు అకారణంగా ఓ స్త్రీని అరెస్టుచేసి ఆమె మీద అత్యాచారం జరిపి, ఆమె శరీరంమీదా, ఆమె మనసుమీదా ఎన్నడూ మానిపోని గాయాన్ని ఎలా రగిలిస్తారో ఈ కథ చాలా సమర్థవంతంగా చిత్రించింది.

ఈ సంకలనంలోని ఇతర కథలు కూడా బావున్నాయి. మంచి కథల్ని వెలికి తీసి పాఠకుల ముందుంచటంలో ఈ 'కథ 90' చాలావరకు సఫలీకృతం అయిందనే చెప్పాలి.

[ కథ 90 : ఉత్తమ కథల సంకలనం, సంకలన కర్తలు : వాసిరెడ్డి నవీన్, పాపినేని శివశంకర్, ప్రచురణ : కథాసాహితి 164, రవికాలనీ, తిరుమల గిరి, సికింద్రాబాదు-500 015. ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్, బాంక్‌స్ట్రీట్, హైదరాబాద్ మరియు విశాలాంధ్ర ఇతర బ్రాంచీలు వెల : రు. 17-00 ]

నూతన ప్రజాస్వామిక విప్లవం వర్ధిల్లాలి!
పరిశ్రమలనూ, విద్యనూ కాదు మతాన్ని ప్రైవేటీకరించండి!

రిపోర్టు :

# 'స్త్రీవాదం - సాహిత్యం'

## —హైదరాబాద్ నగరశాఖ సభ రిపోర్టు

'స్త్రీవాదం - సాహిత్యం'పై జనసాహితి, హైదరాబాద్ నగరశాఖ 18-4-93 తేదీ ఆదివారం సాయంత్రం సిటీ సెంట్రల్ లైబ్రరీలో నిర్వహించిన సాహిత్య సభకు జనసాహితి సంయుక్త కార్యదర్శి సురేష్ అధ్యక్షత వహించారు. సభను ప్రారంభిస్తూ, సురేష్ స్త్రీలు రాస్తున్న రచనలపట్ల జ్వాలాముఖి, యస్వీ చేసిన వ్యాఖ్యానాల్లోని అవాస్తవికతను వివరించారు. అలాగే దిగంబర కవితలో వున్న పాజిటివ్ అంశాలను గుర్తించకుండా చేసే విమర్శలాగా సరైంది కాదన్నారు. స్త్రీకి శత్రువు పురుషుడు కాదు, దోపిడీ సమాజం. దీన్ని గుర్తించకపోతే మొత్తం స్త్రీవాదం గాడి తప్పుతుంది. ఏ పోరాటపు వెలుగులో స్త్రీ చైతన్యం వచ్చిందో దాన్ని గుర్తించాలి. ఎవరికి వ్యతిరేకంగా పోరాటం ఎక్కుపెట్టాలి అన్న విషయం చర్చించాలి అన్నారు.

ఆ తర్వాత స్త్రీవాద రచయిత్రి ఓల్గా తన సుదీర్ఘ ప్రసంగంలో స్త్రీవాదం పుట్టుపూర్వోత్తరాలనూ, స్త్రీవాద సాహిత్యం గురించి మాట్లాడారు. "స్త్రీవాదాన్ని సీరియస్‌గా అర్థం చేసుకుని, దానిలోని తప్పుడు ధోరణులను సరిదిద్ది ముందుకు తీసుకుపోవాలనే ఆలోచన బాగుంది.

"ప్రజలు స్వేచ్ఛకోసం, సమానత్వం కోసం పోరాడినప్పుడల్లా స్త్రీల హక్కులు అన్న అంశం చర్చకు ప్రతి దేశంలోను వచ్చింది. అమెరికా రాజ్యాంగ రచన జరిగినపుడు స్త్రీలు తమ హక్కుల గురించి, కుటుంబంలో ఎదుర్కొంటున్న హింస గురించి ప్రశ్నించారు. బ్రిటన్‌లో ఆస్తి, ఓటు, విద్య హక్కుల గురించి స్త్రీలు పోరాడారు. ఫ్రెంచి విప్లవంలో స్త్రీలు, పురుషులకంటే ఎక్కువగా పోరాడారు. ప్రత్యేక సంఘాలు పెట్టుకున్నారు. వితంతువులకు పెన్షన్ గురించి ఆలోచించారు. రష్యన్ విప్లవ కాలంలో కొల్లంటాయ్ నాయకత్వాన స్త్రీలు తమ సమస్యల గురించి ప్రశ్నించారు- లెనిన్‌తో పెద్ద చర్చే జరిగింది.

"భార్యాభర్తల సంబంధాల గురించి రాస్తే కొందరు దాన్ని పురుష ద్వేషం అంటున్నారు. చైనాలో స్త్రీలు పురుష హింసను ద్వేషిస్తూ కథలు రాశారు కాని వాటిని పురుష ద్వేషం అనలేదు.

"స్త్రీలు రాజకీయ ఉద్యమాలలో పురుషులతోపాటు పనిచేస్తున్నపుడు తమకు తక్కువ పనులు ఇవ్వడమేమిటని సింహావలోకనం చేసుకున్నారు. తీర్మానాలు, నిర్ణయాలు మగవారు చేయడం, వారికి భోజన సదుపాయాలూ, పైపు

చేయడం, రాయడం మాత్రం స్త్రీలు చేయడం. ఇలా ఎందుకు జరిగాలి అనే ఆలోచన ప్రారంభమైంది. వారికి ప్రపంచం రెండు రకాలుగా పబ్లిక్ ప్రపంచం అంటే రాజకీయాలు, రాజ్యం, పరిపాలన, కళలు - ప్రైవేటు ప్రపంచం అంటే కుటుంబం, ఇంటిచాకిరీ, పిల్లలుగా కనబడింది. అంతేగాక పబ్లిక్ ప్రపంచం అంతా పురుషులదీ, అక్కడి సంస్కృతి అంతా పురుషులకు అనుకూలమైనదిగానూ. ప్రైవేటు ప్రపంచం అంతా స్త్రీలదిగానూ వుందని అర్థమైంది తమ శ్రమనీ, లైంగికత్వాన్నీ, మాతృత్వాన్నీ పబ్లిక్ ప్రపంచం అణచివేస్తున్నదని గ్రహించారు. ఈ అణచివేతకు వెనక వున్నదంతా రాజకీయమే అని రాడికల్ ఫెమినిస్టులూ, సోషలిస్టు ఫెమినిస్టులూ అర్థం చేసుకున్నారు.

"తాగుబోతు భర్త భార్యను కొట్టడం వెనుక కుటుంబ హింస వుంది. ఇది రాజ్యానికి అవసరమైన హింస. ఫెమినిస్టులు చేసిన కొన్ని ప్రతిపాదనలను పోరాటాలకు అన్వయించుకుంటే ఎంతో మంచి ఫలితాలు సాధించవచ్చు.

"రాజ్యం స్త్రీల సంతానోత్పత్తి శక్తిని అదుపు చేస్తోంది. 'ఉత్పత్తి వనరులపై పోరాటమే చరిత్ర' అన్నారు. సంతానోత్పత్తి శక్తి ఒక ఉత్పత్తి వనరు. దీనిని అదుపు చేయడానికి పోరాటాలే జరిగాయి. ఆ చరిత్ర ఎవరూ రాయలేదు. ఆడపిల్ల పుట్టకుండా చేయడానికీ, పుట్టిన తర్వాత చంపడానికి జరుగుతున్న కృషి, ఆడపిల్లలకు సరైన వైద్యం, పోషకాహారం ఇవ్వక వారిని అర్థాంతరంగా చంపివేయడం మొదలైనవన్నీ పరిశీలించాలి. భూమి సంబంధాలు మారుతున్నప్పుడల్లా వివాహ సంబంధాలు మారుతూ వచ్చాయి.

"స్త్రీవాదానికీ, మార్క్సిజానికీ ముఖ్యంగా మూడు విషయాల్లో తేడా వుంటుంది. స్త్రీవాదం నిర్మాణ పద్ధతులను అంగీకరించరు. దీనివల్ల పెత్తనం చలాయించడం వస్తుందని వీరి భావన. మనం దేన్ని సాధించదలచామో దాన్ని సాధించే పద్ధతులు చిత్తశుద్ధితో నిండి వుండాలి. అంతేగాక అంతిమ లక్ష్యం అన్న భావనను స్త్రీవాదం అంగీకరించదు. ఈ మూడు విషయాలపై చర్చ జరగాలి. ఒకరి నుంచి మరొకరు నేర్చుకోవాలి- పరస్పరం అభివృద్ధి సాగించాలి.

"తెలుగు సాహిత్యంలో స్త్రీవాద దృక్పథంతో గురజాడ, చలం, కొ.కు చాలా విలువైన రచనలు చేశారు. ఆనాటి సమాజాన్ని మధురవాణి, అసిరిగాడు పాత్రలు ద్వారా గురజాడ బాగా చెప్పాడు. చలం రాసిన 'స్త్రీ' పుస్తకంలో నేల సమస్యల గురించి ఎంతో సమాచారం వుంది. చలం చెప్పిన విషయాలనే కొ.కు తెలివిగా చెప్పి ప్రశంసలందుకున్నాడు-చలం తిట్లు తిన్నారు. ఉదా : 'సైరంధ్రి' కథ.

"1960 తర్వాత స్త్రీలు తమ సమస్యలను తాము చెప్పుకోవడం చేశారు. శ్రీదేవి 'కాలాతీత వ్యక్తులు' నవలలో చదువుకున్న అమ్మాయిల సమస్యలను చిత్రించారు. లత, వాసిరెడ్డి సీతాదేవి, రంగనాయకమ్మలలో ఎవరి ధోరణి వారిదే,

"1970ల నుంచీ సమాజంలోని ఆలోచనల్లో మార్పు వచ్చింది. 70వ దశాబ్దం స్త్రీలకు సంబంధించి ముఖ్యమైన దశాబ్దం 70కి ముందు అనేక ఉద్యమాల్లో పనిచేసిన స్త్రీలు తమ గురించి తాము ఆలోచించడం ప్రారంభించారు. ఉద్యమాల క్రమంలో తమ పాత్ర, ఉద్యమాలు పూర్తయిన తర్వాత తమ పాత్ర ప్రశ్నించుకొని స్త్రీల సంఘాలను స్థాపించుకొని, స్త్రీల సమస్యలపై పనిచేయడం ప్రారంభించారు. లైంగిక దాడులపై చట్టం, వరకట్న హత్యలపై చట్టం, మొదలైనవాటిలో మార్పులు సాధించారు. సంతాన నిరోధక ప్రక్రియల్లో కొన్నిటిని ప్రతిఘటించారు.

"ఈనాడు స్త్రీలు కవితలు రాస్తూ తమ శరీరాలగురించి, శారీరక సమస్యల గురించీ అక్కడక్కడా రాస్తున్నారు. ఇదే పెద్ద సమస్య అయిపోయింది కొందరికి. ఎందుకంటే సమాజం స్త్రీ శరీరాన్ని చాలా జాగ్రత్తగా కాపాడింది. స్త్రీ శరీరంపట్ల ఆకర్షణను సమాజం అలవాటు చేసింది. ఈ కవితలు రాసేవారిలో కొన్ని తప్పులు వుండవచ్చు. వాటిని పట్టుకొని మొత్తం స్త్రీవాద కవితలన్నిటిపై భయంకరమైన దాడి చేయడం ఆశ్చర్యంగా వుంది, సాహిత్య విమర్శ అవసరమే. పుస్తక సారాన్ని అర్థంచేసుకొని, సామాన్య ప్రజలకి అర్థమయ్యేట్లుగా వివరించాలి. 1950 ప్రాంతాలలో ప్రచురితమైనా కూడా 'అతడు-ఆమె' నవలలో స్త్రీ పురుష సంబంధాల చిత్రణ గురించి ఎవరూ పట్టించుకోలేదు. స్త్రీవాద సాహిత్య విమర్శ చేసేవారు, స్త్రీలపై అణచివేత మూలాలు పట్టుకోవడంలో రచయిత ఎక్కడ విఫలమయ్యాడు లేక సరిగా అర్థంచేసుకున్నాడా అన్నది కీలకంగా తీసుకొని విమర్శించాలి.

"ఈనాడు స్త్రీలచేత చిన్నచిన్న Units పెట్టి, వారికి సంఘాలు లేకుండా పెట్టుబడిదారులు శ్రమదోపిడి చేస్తున్నారు. ఈ సంపద అగ్రరాజ్యాల చేతుల్లోకి పోతోంది. మరోవైపు కార్మికులను రిట్రెంచి చేస్తున్నారు. ఈ పోరాటంలో స్త్రీలకు భర్త, పిల్లలు, అధికారి, పోలీసులు, ప్రభుత్వం, IMF, ప్రపంచ బ్యాంకు, అగ్ర రాజ్యాలు శత్రువుగా నిలుస్తున్నాయి."

ఆ తర్వాత మాట్లాడిన జనసాహితి ప్రధాన కార్యదర్శి కొత్తపల్లి రవిబాబు తన ప్రసంగంలో ఇలా చెప్పారు. "ఓల్గాగారు చక్కగా స్త్రీవాదమంటే ఏమిటో వివరించారు. వారు చెప్పిన మూడు వివాదాస్పద విషయాలు— నిర్మాణం, సాధనాలు, అంతిమ లక్ష్యం గురించి చర్చించడం చాలా అవసరం.

"ప్రపంచంలో సగ భాగమైన స్త్రీల దృక్పథం నుంచి ప్రపంచాన్ని అర్థం చేసుకోవడం ఫెమినిజం కాగా, మొత్తం స్త్రీ, పురుషుల దృక్పథం నుంచి ప్రపంచాన్ని అర్థం చేసుకోవడం మార్క్సిజం. కనుక మార్క్సిజంతో దీన్ని పోటీ పెట్టడం అశాస్త్రీయం. ఆర్థికమే సమస్త సమస్యలన్నిటినీ పరిష్కరిస్తుందని మార్క్సిజం ఎక్కడా చెప్పలేదు. 'ఆర్థిక పరివర్తన వస్తే స్త్రీల సమస్యలు కూడా వాటంతటవే

పరిష్కారమైపోతాయని మార్క్సిజం చెప్తోంది. కాని రష్యా, చైనాలో అలా జరిగ లేదు గదా' అనే వాదన స్త్రీవాదులు కొందరు చేస్తున్నారు. కనుక మార్క్స్, ఎంగెల్స్ అవగాహన అదికాదు అని స్పష్టంచేస్తున్నాను. 'Against vulgarisation of Historical Materialism' అన్న పత్రికతో ఎంగెల్స్ రాసిన ఒక లేఖ దీన్ని స్పష్టం చేస్తుంది. ఈ వాదనను ఇంకా పొడిగించి ఈ స్త్రీ వాదులు మార్క్సిజం విఫలమైందని ప్రచారం చేస్తున్నారు. ఇదీ అంగీకరించలేని విషయమే. మార్క్సిజాన్ని విజయవంతం చేయడంలో కొన్ని దేశాల పార్టీలు విఫలమయ్యాయిగాని మార్క్సిజం విఫలం కాలేదు. అదీగాక ఈ వాదన చేసేవారు - 'ఈ ప్రపంచం ఇంతటితో సరి' అని అనుకొని మార్క్సిజం గురించి అంతిమ నిర్ణయాలు ప్రకటిస్తున్నారనుకోవాలి. అదే విధంగా మార్క్సిజాన్ని నమ్మిన వివిధ పార్టీలలో పురుషాధిపత్య ధోరణులు వుంటే వాటికి వ్యతిరేకంగా పోరాడటం అవసరమే. కాని అలా చేయకుండా మార్క్సిజానికి వ్యతిరేకులుగా తయారవడం సరైంది కాదు. సరిగ్గా ఇక్కడే మాకూ అనుమానం వస్తోంది—'ఈ స్త్రీవాదం ద్వారా మార్క్సిజానికి వ్యతిరేకంగా' జ్వాలాముఖి అన్నట్లు 'అంతర్జాతీయ కుట్ర ఏదైనా వుందా' అని !

“వర్గ సంఘాలలో పని చేస్తూనే స్త్రీలు చైతన్యవంతమైన గ్రూపులు ఏర్పాటు చేసుకొని, పురుషాధిపత్య ధోరణులకు, భూస్వామ్య సంస్కృతికి వ్యతిరేకంగా పోరాడటం సరైన విధానంగా వుంటుంది గాని, మార్క్సిజాన్ని తప్పుపట్టడం సరైనది కాదు.

“స్త్రీలు శ్రమ జీవులలో విడదీయరాని భాగం. స్త్రీల విముక్తి మెజారిటీ ప్రజల విముక్తితో ముడిపడి వుంటుంది. ప్రజల విముక్తి సాధించిన తర్వాత, ముందూ కూడా భావజాల రంగంలో తరతరాలుగా జీర్ణించుకొన్న కొన్ని ధోరణులను ప్రజలలో, మనలో తొలగించుకోవాల్సి వుంటుంది.

“స్త్రీ పురుషుల మధ్య వున్న వైరుధ్యం కొందరు స్త్రీవాదులు శత్రుపూరిత వైరుధ్యం అని ఎంగెల్స్ వాక్యాలు కొన్ని ఉదహరిస్తూ ప్రచారం చేస్తున్నారు. ఇది సరైన దృక్పథం కాదు. స్త్రీ పురుషుల మధ్య వైరుధ్యం మిత్రపూరిత వైరుధ్యం. దీనిని ఐక్యత, పోరాటం. ఐక్యత క్రమంలో ఐక్యతను బలోపేతం చేసుకోవాలి. ఈ పోరాటం స్త్రీ పురుషుల మధ్య మరింత అవగాహన, నిజమైన ప్రేమ పెంపొందించడానికే గాని శత్రుపూరితం చేయడానికి కాదు. ఈ వైరుధ్యానికి కారణం వ్యవస్థలో చూడాలి. ఈనాడు రాజ్యం పితృస్వామిక వ్యవస్థను సమర్థిస్తోంది. పోషిస్తోంది. ఈ రాజ్యానికి వ్యతిరేకంగా పోరాడే చైతన్యాన్ని స్త్రీలలో కలుగచేయాలి. అంతేగాని పురుష ద్వేషం పరిష్కార మార్గం కాదు.

మాన్ని ఇక్కడగ ప్రస్తావించి తీరాలి. స్త్రీలు ఈ ఉద్యమం ద్వారా కుటుంబంలో పురుషుడి బాధ్యతలను గుర్తింపచేసారు. అలాగే తాగబోయించే రాజ్యాన్ని ధిక్కరించారు. ఒక విధంగా పితృస్వామిక విలువలకు వ్యతిరేకంగా ఉద్యమించారు. ఈ ఉద్యమ చైతన్యం పునాదిగా మహిళా శక్తిని వివిధ సాంఘిక, ఆర్థిక పోరాటాల వైపు మళ్ళించడం స్త్రీల సంఘాలు, ఇతర సంఘాలు చేయాలి మతోన్మాదానికి వ్యతిరేకంగా మహిళలు చేయాల్సిన పోరాటాల గురించి వివరించాలి. ఈ సారా వ్యతిరేక ఉద్యమం ఉధృతంగా సాగుతున్న కాలంలో 'ఆంధ్రప్రభ' సాహితీగవాక్షం పేజీలలో, ఈ ఉద్యమం గురించి ఒక్క వాక్యం కూడా రాయకుండా స్త్రీవాద సాహిత్యంపై కొన్ని వారాల పాటు పండిత చర్చ జరిగింది. సమకాలీన సమస్యలతో link చేస్తూ స్త్రీవాద సాహిత్యంపై చర్చ జరిగి వుండాల్సింది. 1988 లోనే తెలంగాణా ప్రాంతంలో సారా వ్యతిరేక ఉద్యమం స్ఫూర్తితో నారాయణస్వామి రాసిన కవిత 'చిరుచీకటి వెన్నెల' మీకు వినిపిస్తాను.

"స్త్రీ వాదులలో కొందరు విపరీత ధోరణులను ప్రచారం చేస్తున్నారు. బూర్జువా ఫెమినిజం ధోరణి ఇది. 'మగవాళ్ళేం చేస్తే మనమూ అది చేద్దాం' అనే ధోరణి ఇది. వాళ్ళు సిగరెట్లు తాగుతున్నారు - మనమూ తాగుదాం. వాళ్ళు చాలా మంది స్త్రీలతో సంబంధాలు పెట్టుకుంటున్నారు - మనమూ చాలామంది పురుషులతో సంబంధాలు పెట్టుకుందాం. ఇదీ వీరి వాదన. ఇది ఎలా ఉందంటే 1930 ప్రాంతాలలో కృష్ణా, గుంటూరు జిల్లాల్లో బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమంలో భాగంగా సంస్కృత మంత్రాల్లోని అశాస్త్రీయత గురించి చర్చించకపోగా, ఈ మంత్రాలు బ్రాహ్మణులే ఎందుకు చదవాలి? మనం నేర్చుకుని మనమూ పెళ్ళిళ్ళు చేద్దాం అని కమ్మ బ్రాహ్మణులు తయారయ్యారు. బ్రాహ్మణిజం విలువలను ప్రశ్నించకపోగా వీరు వారికంటే ఛాదస్తులుగా తయారయ్యారు. అలాగే ఈనాడు పురుషుడి తప్పుడు ధోరణులను అడ్డుకోవడం కాకుండా, తామూ అదే ధోరణి అవలంబిస్తామని స్త్రీ వాదులు అనడం ఆశ్చర్యకరం. అమెరికన్ స్త్రీవాద రచయిత్రి ఎరికా జోంగ్ ఇటువంటి ధోరణికి చెందినదే. ఆమె రాసిన 'Fear of Flying' అనే నవల దీనినే సమర్థిస్తోందని ఆమెను పొగుడుతూ ప్రస్తుతం మార్కెట్‌లో వున్న "ఆంధ్రప్రభ" వారపత్రికలో ఒక పాఠకురాలు ఉత్తరం రాసింది.

"బలహీనంగానైనా మరో తప్పుడు ధోరణి స్త్రీవాద రచయిత్రుల్లో చూస్తున్నాం. అది స్త్రీలే స్త్రీలకు సంబంధించిన సమస్యలపై రచనలు చేయాలి. ఆ స్త్రీల రచనలను స్త్రీలే విమర్శించాలి. స్త్రీవాద సాహిత్య విమర్శకులుగా స్త్రీలే వుండాలి. స్త్రీల సమస్యలపై, స్త్రీవాద సాహిత్యంపై ఎటువంటి రచనలూ పురుషులు

చేయగూడదని నిషేధం విధిస్తారు వీరు. ప్రస్తుతం ఇటువంటి ధోరణే దళిత సాహిత్యానికి సంబంధించి కొనసాగుతోంది. ఈ ధోరణిని జనసాహితి అంగీకరించడం లేదు. 'పెళ్ళిచూపులు' అనే కవిత చదివి వినిపిస్తాను. ఎంతబాగా పెళ్ళిచూపుల తతంగాన్ని కవిత రూపంలో వివరించారో చూడండి.

"ఈనాడు స్త్రీల సమస్యలను ప్రతిభావంతంగా కవితా రూపంలో ఎక్కువగా కె. గీత, కొండేపూడి నిర్మల, మహజబీన్, కె. వరలక్ష్మి, వజ్రాల ఇందిర, జయప్రభ, ఓల్గా, సావిత్రి, నన్నపనేని రమాదేవి, రావులపల్లి సునీత తదితరులు రాస్తున్నారు. విమల మార్క్సిస్టు అవగాహనతో స్త్రీల సమస్యలపై కవితలు రాస్తున్నారు. స్త్రీల శారీరక సమస్యలూ, మానసిక సమస్యలూ, ఆడ, మగ పిల్లల పెంపకంలో తేడాలు, ఆడా, మగా ఆటలు, పుట్టినిల్లు వదలి అత్తగారింటికి వెళ్ళడం, భర్తే సర్వస్వం అనుకోవడం, ఆడా, మగా ప్రవర్తనా నియమావళులు, భర్తలు పెట్టే బాధలూ, ఆత్మహత్యలూ, భార్యగా చట్టబద్ధమైన వేశ్యగా బతకడం, తల్లిగా పిల్లల పెంపకం, ఇంటి చాకిరి, పిల్లలు విప్లవకారులై ఎన్‌కౌంటర్లో మరణించడం పట్ల తల్లి చూపే వ్యథ, గర్వం, కూలి మనిషిగా, శ్రమజీవిగా అనుభవాలు, గెరిల్లా పోరాట యోధురాలుగా అనుభవాలు, విప్లవకారుని భార్యగా, సోదరిగా, తల్లిగా అనుభూతులు మొదలయిన వాటిపై కవితలు ఈనాడు మన ముందున్నాయి.

"మార్క్సిజం పీడిత జనపక్షపాతిగా వుంటుంది. ఈ పీడితుల్లో భాగమైన స్త్రీలు పురుషులతో పోలిస్తే మరొక అదనపు పీడనకు గురౌతున్నారు. అదే పురుష పీడన. అదనపు పీడనకు గురౌతున్న స్త్రీలపట్ల మార్క్సిజం తప్పనిసరిగా పక్షపాత దృష్టి మరింత ఎక్కువగా ప్రదర్శిస్తుంది.

"మార్క్సిజం నమ్మినవారు స్త్రీలలో పెల్లుబుకుతున్న చైతన్యాన్ని అభినందించాలి! వారి సరైన దృక్పథాన్ని, ధోరణులను, పోరాటాలను సమర్థించాలి. స్త్రీవాద సాహిత్యంలో ప్రదర్శితమయ్యే తప్పుడు ధోరణులనూ, వక్రీకరణలనూ స్నేహపూర్వకంగా ఎత్తిచూపి సరిదిద్దాలి. వివిధ వివాదాస్పద విషయాలపై చర్చించడానికి అనువైన పద్ధతిలో విమర్శించాలి.

"అంతిమంగా స్త్రీని ఒక వస్తువుగా చూస్తున్న ధోరణిని విమర్శిస్తూ ఓల్గా రాసిన కవిత "సూపర్ ఉమెన్ కాలేను" వినిపిస్తూ ముగిస్తున్నాను."

ఆ తర్వాత సెంట్రల్ యూనివర్శిటీలో పరిశోధన విద్యార్థిని కాత్యాయని 'నేటి స్త్రీవాద ధోరణులు-నవలలు-కవితలు' అనే అంశంపై మాట్లాడారు. వారి ప్రసంగ వ్యాసం వచ్చే సంచికలో ముద్రిస్తున్నాం.

—)o(—

# పిల్లల ప్రపంచం




## కన్నా! ఇది మీ కోసం....

పసిపాపల్లారా!
పాల నవ్వుల్లారా!
పూల మొగ్గల్లారా-
కత్తి మొన మీద కదులుతున్నారా॥
॥పసి॥

* పుట్టి పుట్టంగానే
పాలు పట్టంగానే
తల్లి ఒడిలో నుంచీ
స్కూలు లాగేసిందీ
పుస్తకాల బరువూ
వీపుపై చేరిందీ
స్కూళ్ళే జైళ్ళయిపోగా-
బాల్యం బందీగా గడుపుతున్నారా।
॥పసి॥

* తల్లి కౌగిటిలోనో
తండ్రి మురిపెంలోనో
ఆటపాటల్లోనో
పూల తోటల్లోనో
వెన్నవంటి దేహం
వికసించే ప్రాయం
కాలే కడుపూ తోనీ
కనలే దేహం తోనీ
చౌరస్తాల వద్దా
చెత్తకుండీ లోద్దా
బ్రతుకుపోరును జరుపుతున్నారా।
॥పసి॥

* దీప ప్రమిదల నడుమ
దివ్యకాంతుల్లాగా
కొత్తబట్టలు తొడిగే
కాకరపూలా కాల్చి
పండుగ మాధుర్యాన్ని
పంచిపెట్టే వేళా
మందు ఫ్యాక్టరీల్లోనూ
గంధక ధూమంల్లోనూ
చిక్క చీకటిలో చితికి పోయేరా।
॥పసి॥

* బాల్యం బలిగా పెట్టి
బొగ్గు గనులా దొలిచీ
సంద్రం మీదా గెలిచీ
బంగరు మీనుల దెచ్చీ

— అజ్ఞాత కవి

---

నిర్వహణ : పి. చంద్రశేఖర్ ఆజాద్ APSTC Ltd, డి. సి ఎమ్. ఎస్. బిల్డింగ్స్, ఎస్. ఆర్. పేట, ఏలూరు.

యుద్ధ భూముల్లోనా
శత్రు శిబిరం చొచ్చి
కాపడి వస్తాకా పాలకుల చేతుల్లో
మీరు పావులై కదులుతున్నారా ।
॥పసి॥
వెలుగుకన్నా పంచే మేలుకన్నా
కన్నా

డేలీ పేపర్లలో పాల ప్యాకెట్లలో
బూట్ పాలిషులలో కారు షెడ్డుల్లోనో
హోటళ్ళ సేవల్లోనో ఏ చాకిరిలోనో
పశువుల కాపరిగానో
విలువలేని ప్రాయం-
విరిగిపోయిందన్నా ॥పసి॥

## అస్తమిస్తున్న సూర్యుళ్ళు

వీళ్ళు ప్రజాస్వామ్యానికి ముద్దుబిడ్డలు
ఎవరి ఆవేశాలకో ప్రతీకలయిన
ప్లాట్ ఫారపు పట్టి మంచాల పాల పసికందులు
బాల్యమంతా కశ్మలంలో కాలం వెంచిన
అభాగ్యులు, ఆస్కారంలేని వాళ్ళు
వచ్చేపోయే పాసింజర్ల ఎండను కరిగించే ప్రేమమూర్తులు
ఏ అక్షరజ్యోతులు వీళ్ళ బ్రతుకుల్లో
వెలుగులు పండించవు
ప్రణాళికల్లో ప్రగతులు, దరి చేరనివాళ్ళు
పారేసిన ఖాళీ అన్నం పేకెట్లే వీళ్ళ ఆకలి తీర్చే హస్తాలు
వీళ్ళను కూడ దోచుకునే వ్యాపారస్తులున్నారు
శాసించే ఇనపటోపీలున్నాయి
దేశంలో ఎన్నో అనాథ శరణాలయాలు
వీళ్ళని పట్టించుకోనని కరుణాలయాలు
ఈ దేశంలో లేని దొక్కటి ఎదురౌతుంది
ఇక్కడ మనకు
దొరికినది సమానంగా పంచుకు తినే
ప్రజాస్వామ్యం

- పి. అనంతరావు

# అరుణోదయ ప్రధాన కార్యదర్శి రామారావు తదితరులపై పెట్టిన అక్రమ కేసుని ఎత్తివేయాలి

## పూనా పోలీసుల దౌర్జన్యకాండను ఖండించండి

ఈ నెల 7, 8 తేదీలలో బొంబాయిలో జరిగిన దేశ వ్యాపిత విప్లవ కార్మిక సంఘాల "ఐక్యతా సదస్సు"కు తమ సాంస్కృతిక బృందాలతో ఉత్తేజకరమైన కార్యక్రమాలు ఇచ్చి, ఆంధ్ర నుంచి హాజరైన వేలాది ప్రజాసీకంతో కలిసి రైలులో తిరిగి వస్తున్న "అరుణోదయ" (విప్లవ సాంస్కృతిక సంస్థ) ప్రధాన కార్యదర్శి రామారావు తదితరులను పూనా పోలీసులు తీవ్రంగా లాఠీఛార్జి జరిపి, గాయపరిచారు. ఊరేగింపులో పాల్గొని తిరిగి వస్తున్న వారిని పూనా రైల్వే స్టేషన్‌లో ఆగి వున్న రైలులోంచి దించి, విచక్షణారహితంగా లాఠీఛార్జి జరిపి పలువుర్ని గాయపరిచారు. విషయం వివరించడానికి ముందుకెళ్ళిన అరుణోదయ రామారావుని చెబుతున్న మాటలు వినకముందే రాక్షసంగా తలలు పగిలేటట్లు, గూండాల్లాగా చితకబాది చేతులపై మోసుకుని తీసుకుపోయి స్టేషన్‌లో నిర్బంధించి, చిత్రహింసలకు గురి చేస్తున్నారు. 10వ తేదీ మధ్యాహ్నం 18 మందిని నిర్బంధించిన పూనా పోలీసులు అక్రమంగా కేసులు బనాయించి, ఎరవాడ సెంట్రల్ జైలుకి పంపారు.

అయోధ్యలో బాబ్రీ మసీదుని కూలగొట్టి దేశ సమగ్రతను, ప్రజల ప్రాణాలను బలిగొన్న హిందూ మతోన్మాదులు రైళ్ళకు రైళ్ళు ఆక్రమించి అయోధ్యకు దూసుకెళ్ళినపుడు, తిరిగి వారిని సురక్షితంగా చేరవేయడానికి ప్రత్యేక రైళ్ళు నడిపినపుడు, సూరజ్‌కుండ్‌లో కాంగ్రెసువారి సభలకు జనాన్ని ఎగుమతి, దిగుమతి చేసుకోవడానిక్కి రైళ్ళు ఉపయోగించినపుడు ఒక్క పోలీసు లాఠీ దెబ్బకూడా వేయని వారు విప్లవ కార్మిక సంఘాల ఐక్యతా సదస్సుకి వెళ్ళి వస్తున్నందుకు ఎందుకు లాఠీఛార్జి చేయవలసి వచ్చిందో పూనా పోలీసు వారు సమాధానం చెప్పాలి.

అరుణోదయ రామారావు తదితరులపై పూనా పోలీసుల పాశవిక దౌర్జన్యకాండను ఖండిస్తున్నాము. పూనా పోలీసులు పెట్టిన కేసుల ఎత్తివేయాలని, లాఠీఛార్జి చేసి గాయపరచిన పోలీసు అధికారులపై చర్య తీసుకోవాలని డిమాండ్ చేస్తున్నాం

**దివికుమార్**

అధ్యక్షులు

అరుణోదయ

20 - 5 - 93 (విప్లవ సాంస్కృతిక సంస్థ)

# అక్షరాల్ని సాయుధం చేస్తా....

తెరుచుకొని
మూసుకొని
లెక్క చూసుకొని
సంసారం సంచిని విప్పుకొని
ప్లస్‌లు-మైనస్‌లు
హెచ్చివేతనలో లెక్కించుకుంటే
డిపై డెడ్‌మైలు సమాధానాలై
డిక్‌టేట్ చేస్తాయి
రోజూ వేస్తున్న ప్రతి అడుగునూ
బొమ్మా బొరుసు వేసుకునే గదా
ఎంతగీసులాడినా
1 నుండి 31ల మధ్య
నిన్ను నువ్వు గాక్కోవడమే కదా
చూస్తున్న చూపుకు ప్రతిగా ఏమీ
కనిపించక
అంధగీతాల్ని వేసుకుంటూ
జారిపడ్డ నేలమీద పాకుడును కదప
కుండా
బలంగా ఇంకో పాదం మోపుకుంటూ
పాకుంటూ........ పాకుంటూ
తెలియకుండా
ఇట్లాగు "నేను"లో దిగబడుతుంటే
నేనెక్కడ దిలుతానన్నది ప్రశ్న
వెనకడుగే గదా ఇది—
వెనుకదెబ్బ కాదుగదా అని
వెధవ ఓదార్పు ఒకటి
నాకు నేనుగా కితాబులిచ్చుకొని
ఏమిటీ శ్మశాన సంతాప సల్లాపం-
జీవితాన్ని నిలువునా బొంద్రాయిలా
పాతుకొని
తలనిక్కించి ఆకాశంలోకిచూస్తుంటే
భూమ్మీద చెదిరిన గుంపులు
కూల్చబడిన బ్రతుకు గుడారాలు
పగిలిన గడపగుండెల ఘోషలు-
అధికారం నాలుగు తలల సింహమై
ఇంకో నాలుగు తరాలకు వదలని
భల్లూకపు పట్టై
తనవాళ్ళసరిహద్దుల్ని సరిగ్గా వెన్నుల
మీద వొత్తిగిల పెట్టి తొక్కుతుంటే
వరుస క్రమంలో మధ్యమాన వున్న
నేను
నా వంతు వచ్చే వరకూ చూస్తుంటే..
ఏమిటక్కడ........వొంటి మీద
అందుకే—
మరందుకే—
భద్రత లేని బ్రతుకులై
ఎందుకింత ఆరాటం
చావుకు కనీస అర్హత
సంపాదించడం కోసమన్నా కలుద్దాం
పోరాటంలో
అందుకందుకే—
శరీరాన్ని జెండా చేసుకొని
గొంతును గుతప చేసుకొని
ఓరేయ్— నాయనో
నువ్వు పాడే పాటకు కోరసవ్వాలని
ఇగో....ఇట్లా అక్షరాల్ని సాయుధం
చేస్తున్నా

(అరుణోదయ రామారావుకు ఈ కవిత అంకితం)

— జూలూరు గౌరీశంకర్

# అశ్లీల స్టార్ నైట్స్‌ను ప్రతిఘటించండి

ఇటీవల కాలంలో సినిమాల ద్వారా, పత్రికల ద్వారా, ఆడియో, వీడియో కాసెట్ల ద్వారా అశ్లీల ప్రచారం ఎంత విశృంఖలంగా సాగుతుందో మనందరికీ తెలుసు. ఈ ప్రచారంలో సిల్క్‌స్మిత, మాల్గాడి శుభలా నిర్వహిస్తున్న పాత్ర కీలకమైనది. స్మిత అంగాంగ ప్రదర్శనలూ, అశ్లీల భంగిమల నృత్యాలూ, శుభ బూతు పాటల, బూతు మూల్గుల ఆడియో కాసెట్లు ఇప్పటికే ప్రజల బలహీనతలను సొమ్ము చేసుకుంటున్నాయి.

ఇప్పుడు వీరు సాధించిన అశ్లీల 'ఖ్యాతి'ని ఉపయోగించుకొని లయన్స్ అనే అంతర్జాతీయ స్వచ్ఛంద సేవా సంస్థ బాధ్యులు, వారిచే స్టార్‌నైట్ కార్యక్రమాలు రూపొందించారు. వీటి కొరకు పెట్టిన టిక్కట్లు అమ్మడం ద్వారా వచ్చిన పైసంతో పేద ప్రజలకు నేత్ర వైద్యం చేయిస్తారట! తమ నేత్రాలు బాగుచేయించుకున్న ఈ పేద ప్రజలు ఆ తర్వాత మరల నిర్వహించే స్టార్‌నైట్స్ చూసి తరించాలేమో మరి!

నిజానికి లయన్స్, రోటరీ అంతర్జాతీయ సంస్థలలో స్థితిపరులైన వారే సభ్యులుగా చేరగల్గుతారు. వీరి లక్ష్యం ప్రకారం తమ ఆదాయంలో కొంత భాగాన్ని సేవా కార్యక్రమాలకు వినియోగించాలి. అలా చేయకుండా, ప్రజల బలహీనతలను రెచ్చగొట్టి నిధిని సమకూర్చుకోవాలనే ఈ లయన్స్ వారి ప్రయత్నాన్ని మొగ్గలోనే తుంచి వేయాలి.

సిల్క్‌స్మిత మంగళగిరిలో మాట్లాడుతూ "అంతరించిపోతున్న కళలను ప్రజలకు చేరువ చేయాలనే సంకల్పంతో ఈ ప్రదర్శనలను ఇస్తున్నా"మన్నారు. అవి ఏ కళలో వివరిస్తే బాగుండేది.

ఈ ప్రదర్శనలను జనసాహితి, అరుణోదయ సంస్థలు నిరసిస్తున్నాయి. విజయవాడలో గతంలో ఒక వారపత్రిక నిర్వహించిన మాల్గాడీ శుభ కార్యక్రమంలో ఎన్ని బూతుపాటలు గానం చేయబడ్డాయో విజయవాడ పౌరులకు తెలుసు. ఆవిడ పాడిన ఆడియో క్యాసెట్ నిండా ఎంత బూతు నింప బడిందో శ్రోతలకు తెలుసు.

ఈ ప్రదర్శనలను రద్దు చేసుకోవాలని నిర్వాహకులనూ, వీటికి హాజరు కాకుండా ప్రజలు తమపై రుద్దబడుతున్న సామ్రాజ్యవాద సంస్కృతిని నిరసించాలని ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నాం.

దివికుమార్ — అధ్యక్షుడు, అరుణోదయ.

రవిబాబు — ప్రధాన కార్యదర్శి, జనసాహితి.

విజయవాడ
4-6-1993

## ప్రజాసాహితి 'కరువు' ప్రత్యేక సంచిక, ఆగస్టు 93 రచయితలకు ఆహ్వానం

రాష్ట్రంలో తాగునీరు లభించక తీవ్ర దుర్భిక్షం, కరువు కాటకాలు పెచ్చరిల్లుతున్నాయి. దీనికి వ్యతిరేకంగా సాగుతున్న ప్రజా ఉద్యమానికి సహకరించటం మన కర్తవ్యం. అందుకు ప్రేరేపించే వాస్తవిక జీవన సంఘర్షణను ప్రతిబింబించే కథలు, వ్యాసాలు, కవితలు, పాటలు జన సాహితి ఆహ్వానిస్తోంది.

దుర్భిక్షానికి పేరు పొందిన రాయలసీమలో ప్రజాస్వామిక భావప్రకటనా స్వేచ్ఛకు కూడా 'కరువు' నెలకొని వుంది. అక్కడి భూస్వామ్య సాయుధ ముఠాల పదఘట్టనలకింద ప్రజలు అణగారి పోతున్నారు. ఈ దోపిడీ పెత్తందార్ల ఆధిపత్యాన్ని, సాయుధ అణచివేతను ఎదుర్కొకుండా అక్కడ ఏ చిన్న సమస్యపై ప్రజా ఉద్యమమైనా నిలదొక్కుకోలేదు. సాగలేదు. కనుక రాయలసీమలో భూస్వామ్య సాయుధ ముఠాల దోపిడీ దౌర్జన్యాలను, వారి అంతః కలహాలనీ, వాటి ఆర్థిక రాజకీయ నేపథ్యాలనూ ఆ ప్రాంతపు సాంస్కృతిక వాతావరణాన్నీ చిత్రిస్తూ రచనలు తగినన్ని రావాల్సిన అవసరం వుందని మేము భావిస్తున్నాం. రచయితలూ కళాకారులూ తప్పక స్పందిస్తారని ఆశిస్తున్నాము. ఆగస్టు 93 "ప్రజాసాహితి"ని 'కరువు' ప్రత్యేక సంచికగా వెలువరించే ప్రయత్నంలో వున్నాము. జులై 15 లోగా రచనలు పంపి సహకరించవలసిందిగా రచయితలను కోరుతున్నాము.

— సంపాదకవర్గం

(8 వ పేజీ తరువాయి)

వగైరా సమస్యల పరిష్కారానికి, మెరుగైన జీవన ప్రమాణాలు సాధించుకోవడానికి ముందు షరతుగా వారు స్వతంత్రంగా ఆందోళన చేసే హక్కును కలిగి ఉండటం అవసరం. ఈ హక్కును వారికి ప్రభుత్వమో, మరొకరో కల్పిస్తారనేది కల్ల మాత్రమే. ఈ హక్కును ఇక్కడి ప్రజలు తమ సంఘటిత శక్తి ద్వారా సాధించుకోవాలి. హక్కులు ఒకరి దయాదాక్షిణ్యాలతో సిద్ధించేవి కావు. అవి పోరాడి సాధించుకునేవి మాత్రమే. మానవ చరిత్ర దీనినే నిర్ధారిస్తున్నది. ఈనాడు రాయలసీమ ప్రాంతంలో ప్రజల ప్రజాస్వామిక హక్కులను కాలరాస్తున్న భూస్వామ్య ముఠాల దోపిడీ, పెత్తనాలకు వ్యతిరేకంగా ప్రజలు సంఘటితంగా ఉద్యమించాలి. ఈ ముఠాలకు అండదండలిస్తూ వారిని పెంచి పోషిస్తున్న ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా ప్రజలు ఉద్యమించాలి. ఈ ముఠా నాయకులకు రాజకీయ ఆశ్రయం కల్పిస్తున్న పార్లమెంటరీ పార్టీలను ప్రజలు ఎండగట్టాలి. ఇటువంటి ప్రజాఉద్యమం నేడు అత్యంత అవసరం. అందుకే అనేక ప్రజాసంస్థలూ, ప్రజాస్వామిక వాదులూ కలసి ఈ క్రింది డిమాండ్లపై ఐక్య ప్రజాఉద్యమం నిర్మించినందుకు కృషి చేయాలని నిర్ణయించుకున్నాము.

★ రాయలసీమలో భూస్వామ్య సాయుధ ముఠాలను ప్రభుత్వం వెంటనే నిరాయుధం చేయాలి. వారి కిచ్చిన లైసెన్సులు రద్దు చేయాలి. వారి వద్దనున్న ఆయుధాలన్నింటిని స్వాధీనం చేసుకోవాలి. లేదా ఈ ముఠాల నుండి ఆత్మరక్షణ చేసుకునే హక్కు ప్రజల కుందనిగుర్తించాలి.

★ రాయలసీమలో ప్రజలపై భూస్వామ్య సాయుధ ముఠాలు సాగించిన దోపిడీ, దౌర్జన్యాలను బహిరంగంగా విచారించి శిక్షించే హక్కు ప్రజలకుండాలి.

★ భూస్వామ్య సాయుధ ముఠాలు దోపిడీ, దౌర్జన్యాల ద్వారా సంపాదించిన స్థిర, చరాస్తులను స్వాధీనం చేసుకొని వాటిని ప్రజా సంక్షేమానికి వినియోగించాలి.

పై డిమాండ్లపై సాగే ప్రజా ఆందోళనలో భాగస్వాములు కావలసిందిగా ప్రజలకు, ప్రజాస్వామ్యవాదులకు విజ్ఞప్తి చేస్తున్నాము. ఈ ప్రజా ఉద్యమంలో భాగంగా జరిగే బహిరంగ సభలు, ఊరేగింపులు, సదస్సులలో పాల్గొని ఈ ఉద్యమానికి చేయూత నివ్వవలసిందిగా కోరుతున్నాము."

ప్రజాసాహితి

ఆశయ నిబద్ధతతో తెలుగులో ఒక మాస పత్రిక నడపడం అంత సులభం కాదు. ఆ పని మీరు చేస్తున్నారు ఎక్కడా రాజీ పడకుండా.

మే నెల సంచికలో రాహుల్ 'వోల్గా సే గంగా' పరిచయ వ్యాసం బాగుంది.

'రారా చిన్న తమ్మయ్యా' పాట నన్ను కదిలించి వేసింది. పుస్తక, సినిమా సమీక్షలు గట్టిగా వున్నాయి. 'గడ్డి' కథ బాగుంది.

హైదరాబాద్ — డా. సి. నారాయణరెడ్డి

రాహుల్ ప్రత్యేక సంచిక చాలా సమగ్రంగా ఉంది. నాకు తెలియని ఎన్నో విషయాలు తెలుసుకునే అవకాశం కలిగింది. ప్రజాసాహితి సంచికకు కొత్త దనంతో అబ్బుర పెడుతున్నది. మీ కృషి అభినందనీయం

**తిరుపతి.** — ఖామన్

కాకరాలగారి వ్యాసం (ఏప్రిల్ 93)లో విశ్లేషణ బాగుంది. రాహుల్జీ తత్వ శాస్త్ర గ్రంథమైన 'దర్శన్ - దిగ్దర్శన్' పుస్తకంపై ఒక వ్యాసం ప్రచురించండి

ఎమ్మిగనూరు — ఈశ్వరప్ప

# చైతన్య వాహిని

**అరుణోదయ విజయవాడ బృందం ;**

* 10-4-1993న గుంటూరులో OPDR - APCLC, ల ఆధ్వర్యములో హిందూరాజ్య ప్రమాదానికి వ్యతిరేకంగా గాంధీపార్కులో జరిగిన బహిరంగ సభకు ముందు "రామజన్మ భూమిహాదురో" అనే నాటకాన్ని ప్రదర్శించారు.

* ఏప్రిల్ 13 నుండి 22 వరకు నిజాంపట్నంలో గుంటూరుజిల్లా కళాకారుల శిక్షణాశిబిరం జరిగినది. 8 రోజుల పాటు జరిగిన ఆ శిక్షణా శిబిరంలో 26 పాటలను 2 నృత్యగేయిలను, తీరప్రాంత సమస్యలపై "దండోరా" వీధి నాటకం "స్త్రీవిముక్తి" నృత్యగానం నేర్పారు. 20 మంది హాజరయిన శిబిరానికి, శిక్షకులుగా ఉదయ్, అనూరాధ, హైదరాబాదు చైతన్య పాల్గొన్నారు. శిబిరం ముగింపు సందర్భంగా

నిజాంపట్నంలో జరిగిన బహిరంగ సభలో దివికుమార్, చైతన్య ఉపన్యసించారు సభ అనంతరం "దండోరా" వీధి నాటకం ప్రదర్శించారు.

29-4-1993న, రేపల్లెలో తీరప్రాంత ప్రజల హక్కుల పరిరక్షణ కమిటీ నిర్వహించిన గుంటూరుజిల్లా సదస్సు సందర్భంగా జరిగిన బహిరంగ సభలో "దండోరా" వీధి నాటకాన్ని తరువాత "రామజన్మ భూమి కాదురో" ప్రదర్శించారు.

* మే 17వ తేదీన సత్తెన పల్లిలో జరిగిన గుంటూరు జిల్లా OPDR మహా సభల్లో పాల్గొన్నారు. గుంటూరుజిల్లా కళాకారులతో కలిసి "రామజన్మ భూమి కాదురో...." వీధి నాటకాన్ని ప్రదర్శించారు. సత్తెనపల్లెలోని రంగస్థల, వీధినాటికల కళాకారులు కూడా పెద్ద సంఖ్యలో హాజరై, నాటక కళాకారులను అభినందించారు. రామజన్మభూమి సమస్య యొక్క మూలాలు- దాని నష్టం పెట్టుకుని రాజకీయ ప్రయోజనాలు పొందుతున్న కాంగీ, బి.జె.పి స్వభావాల్ని ప్రతిభావంతంగా చూపించారని ప్రశంసించారు.

* మే 18న, నందిగామలో జరిగిన కృష్ణాజిల్లా OPDR మహాసభల్లో, ఊరేగింపు, బహిరంగ సభల్లో పాల్గొన్నారు. "రామజన్మ భూమి కాదురో" వీధి నాటకం, "అప్పుల భారతం" (వీధి భాగవత యక్షగానం) ప్రదర్శించారు. కొందరు హిందూ మత దురభిమానులు నాటకంలోని ఒక డైలాగ్‌ను వక్రీకరించి, బూతు మాటలు అన్నారని బనాయించి గొడవ చేయబోయారు. కార్యకర్తలు, ప్రజల వ్యతిరేకతను చూసి వెళ్ళిపోయారు.

* మే 23, 24 తేదీలలో ఒంగోలులో జరిగిన OPDR 11వ రాష్ట్ర మహా సభలలో పాల్గొని, మరో క్రొత్త వీధి నాటకం "నంధ్యాల నుండి పాణ్యం" మొదటి ప్రదర్శన వేశారు. సింబాలిజం సెటైర్‌ను కలిపి నంద్యాల, పాణ్యంలో జరిగిన ఎన్నికల రిగ్గింగు తంతును బాగా బట్టబయలు చేయగలిగారని ప్రశంసలు పొందారు.

* మే 28న గుంటూరు జిల్లా, దాచేపల్లిలో కా॥ కోలా సుబ్బారెడ్డిగారి స్థూపా విష్కరణ సభల్లో పాల్గొని పాటలు పాడారు.

* మే 29న రాజమండ్రిలో, ప్రగతిశీల మహిళా సంఘం (స్త్రీ విముక్తి) ఆధ్వర్యంలో జరిగిన "సారా- లిక్కర్ కాదు- త్రాగునీరు, సాగునీరు కావాలి" సదస్సు- బహిరంగ సభలో "అప్పుల భారతం" వీధి భాగవతాన్ని ప్రదర్శించారు.

## పాణ్యం ఎన్నికలలో అరుణోదయ :

* సారా వ్యతిరేక ఉద్యమ నాయకులు కా॥ సంధ్యకు మద్దతుగా కోట్ల విజయభాస్కర రెడ్డి ప్రభుత్వ సారా విధానాలను నిరసిస్తూ ఎన్నికల ప్రచారంలో వివిధ జిల్లాల అరుణోదయ కళాకారులు అవిశ్రాంతంగా పాల్గొన్నారు. సారా వ్యతిరేక పాటలు, వీధి నాటకాలతో విస్తృతంగా ప్రచారం చేశారు. అభ్యర్థి పర్యటనకు తోడుగా ఒక ప్రధాన సాంస్కృతిక బృందానికి ఉదయ్, మరో ప్రధాన సాంస్కృతిక బృందానికి రామారావు బాధ్యత వహించారు. కళాకారులు కాలినడకన గ్రామ గ్రామానికి వెళ్ళి పాటలు, నృత్యాలతో ప్రచారం చేశారు. మార్చి 31న జరిగిన "చలో బేతంచెర్ల" ర్యాలీ, బహిరంగ సభల్లో పాల్గొన్నారు. ఏప్రిల్ 1న బనగాన పల్లెలో 40 మంది అరుణోదయ కళాకారులు డప్పు నృత్యాలతో, వీధి నాటికలతో "కళా జాతా"ను నిర్వహించారు. పోలింగ్‌లో ఏజెంట్‌లుగా పాల్గొని రాయలసీమ దొరల, గూండాల రిగ్గింగ్, సైక్లింగ్‌లను, దౌర్జన్యాలను స్వయంగా చూశారు. "దొంగ ఓట్లకు తెక్కింపు సిగ్గు సిగ్గు' అంటూ కౌంటింగ్ బహిష్కరణలో పాల్గొని కౌంటింగ్ కేంద్రానికి ఎదుట "రిగ్గింగ్" అనే వీధి నాటకాన్ని అప్పటికప్పుడు ఆశువుగా రూపొందించి ప్రదర్శించారు.

## అరుణోదయ ప్రకాశం జిల్లా :

* మేడే సందర్భంగా శింగరాయ కొండలో అరుణ పతాకాల ఆవిష్కరణలో పలుకూరు దళం పాల్గొని, విప్లవ గేయాలు పాడారు.... పలుకూరులో జరిగిన బహిరంగ సభలో పాటలు పాడారు. ఉప్పు గుండూరు దళం "జలగ" నాటకం 'చాగంటి భాస్కర్' ఏకపాత్రాభినయం ప్రదర్శించారు.

వెంకటగిరిలో జరిగిన మేడే బహిరంగ సభలో ప్రదర్శనలిచ్చారు. కా॥ రసూల్ రాసిన మత్తోన్మాద వ్యతిరేక పాటను పాడారు.

మే 3వ తేదీన కందుకూరులో దళిత యువకుడు విజయసారథి హత్యను ఖండిస్తూ జరిగిన బహిరంగ సభలో పలుకూరు, ఉప్పు గుండూరు దళాలు పాల్గొని దళిత పోరాట పాటలను, విప్లవ గేయాలను పాడారు. ఈ సభ మరింత చుట్టు ప్రక్కల గ్రామాలలో వారంరోజులు దళ ప్రచారం చేశారు,

మే 23, 24న ఒంగోలులో OPDR రాష్ట్ర మహాసభల సన్నాహక కృషిలో పాల్గొని, దళ ప్రచారం చేశారు. బహిరంగ సభలో చెర్లోపాలెం బాల కళాకారులు

"నగారే.... పిసిగి" "జాజిరి జాజిరి" పాటలకు బృందనృత్యాలు చేసి పలువురి ప్రశంసలు పొందారు. మహాసభలో 23న దళిత సమస్యపై "నరమేధం" నాటకం ప్రదర్శించారు. బహిరంగ సభలో వేసిన "రామజన్మ భూమి కాదురో", 'నంద్యాల నుండి పాణ్యం' నాటకాలలో విజయవాడ బృందంతో కలిసి ప్రదర్శనలో పాల్గొన్నారు.

**అరుణోదయ హైదరాబాద్ :**

* మేడే సందర్భంగా హైదరాబాద్ మహా నగరంలో జరిగిన అనేక మేడే సభలలో అరుణోదయ ప్రధాన కార్యదర్శి రామారావు తన గొంతెత్తి విప్లవ గేయాలు ఆలపించి, తన మేడే పిలుపుతో కార్మికులను ఉత్తేజ పరిచారు.

**బొంబాయి మహా నగరాన్ని భుజస్కంధాలపై మోస్తున్న కార్మిక మురికివాడల్లో అరుణోదయ ప్రచార భేరీ**

ఇఫ్టూ, వర్కర్స్ సాలిడారిటీ, కామెగార్ ఏక్తా మొదలగు విప్లవ కార్మిక సంఘాల ఐక్యతా సదస్సు సందర్భంగా 28-4-93 నుండి 8-5-93 వరకు అరుణోదయ బృందాలు బొంబాయి మురికివాడల్లో విస్తృత ప్రచారం చేశారు. హైదరాబాద్, విజయవాడ, ఉత్తర తెలంగాణా జిల్లాల నుంచి అరుణోదయా కార్యకర్తలు తరలి వెళ్ళారు. హైదరాబాద్, ఉత్తర తెలంగాణా జిల్లాల కార్యకర్తలు బొంబాయి లోని కొన్ని మురికివాడల్లో ప్రచారంచేసి, భివాండీ వెళ్ళారు. ఆంధ్రా నుంచి వలస వెళ్ళిన లక్షలమంది చేనేత, తదితర శ్రామిక ప్రజలమధ్య ప్రచారం చేశారు. ప్రచారం చేసే హక్కుని అడ్డుకుంటూ రెండుసార్లు భివాండీ పోలీసులు అరెస్టు చేసి, లాకప్‌లో లాఠీచార్జి చేసి, టాడా కేసుల్లో ఇరికిస్తామని బెదిరించారు. విజయవాడ నుండి వెళ్ళిన అరుణోదయ బృందం మే 3 నుండి మే 8 వరకు ప్రచారంలో పాల్గొన్నారు. బొంబాయిలోని సాకినాక (సత్యనగర్)లో, వర్లీ లోని సమకాలనీలైన దోభీఘాట్ సెంటర్, జీజీమాత సెంటర్, ప్రేమ్ నగర్, ప్రేమ్‌నగర్, గాంధీనగర్, భవానీచాల్ (మహేంద్ర భూమహేంద్ర బిల్డింగ్ ఎదుట) గోపాల్‌నగర్, శివసేన నగర్, సైన్: విజయనగర్ కాలనీలలోను, దాదర్‌లోని భవానీశంకర్ రోడ్ స్లమ్, ప్రభాదేవీగల్లీ, వస్త్రచాల్, కాటిగల్లీలోను, పరేల్‌లోని బైల్ ఘోడా స్లమ్‌లలో విస్తృతంగా ప్రచారం చేశారు. ఆయా స్లమ్ కాలనీలలో ఉన్న వివిధ భాషలకు చెందిన చేనేత మిల్లు, బీడీ రెడీమేడ్ దుస్తుల కార్మికులు, చిన్న చిన్న పేవ్‌మెంట్

చిల్లర వ్యాపార జనం మధ్య 'అప్పుల భారతం' వీధి భాగవతం ప్రదర్శనలు,
పాటలు, గ్రూప్ మీటింగ్‌లు నిర్వహించారు. ఆవేశమైన అభివాదనాలు చవి
చూశారు. వర్లీలోని గాంధీనగర్ వద్ద “అప్పు భారతం” ప్రదర్శన ముగింపులో
బొంబాయి పోలీసులు వచ్చి చూస్తున్న వందలాది ప్రేక్షకుల్ని తరిమికొట్టి అరుణో
దయ బృంద కళాకారుడు కా॥ నరసయ్యను, స్థానిక కార్మిక సంఘ కర్షకుల్ని
ఇద్దర్ని అరెస్టుచేసి తీసుకెళ్ళారు. చేతిలో ఉన్న డప్పు 3 అడుగుల కర్రల్ని
(మారణాయుధాలుగా కనిపించాయేమో) కలిగి ఉన్నందుకు తీసుకెళ్తున్నాం అని
డి.ఎస్.పి ప్రకటించాడు. 7వ తేదీన శంకర్ గుహనియోగి హాల్ (శిరోద్కర్
హైస్కూల్)లో జరిగిన ఐక్యతా సదస్సులో డా॥ రామారావు, [illegible] నిర్వాహణ
అరుణోదయ, బొంబాయి, బెంగాల్, ఢిల్లీ, ఉత్తరప్రదేశ్‌కి చెందిన కళాకారులు,
ఉత్తేజకరంగా పాటలు పాడారు. 8వ తేదీన నర్సుల్లా మైదాన్ నుండి బహిరంగ సభా
స్థలం జాంబోరీ మైదాన్ వరకు సాగిన బ్రహ్మాండమైన ఊరేగింపు అగ్రభాగాన
నల్గొండ, విజయవాడ, హైదరాబాద్, తెలంగాణా జిల్లాల అరుణోదయ కళాకారుల
డప్పుల చప్పుళ్ళని గజ్జెల లయలతో డ్యాన్సులతోను, “హాపాయి మోడలో ఒప్పం
దాల ఉరితాడు వేసి లాక్కుపోతున్న సామ్రాజ్యవాది, దాసోహం అంటున్నా
ప్రభుత్వం” వేషాలు బొంబాయి ప్రజానీకాన్ని విశేషంగా ఆకర్షించాయి. బహిరంగ
సభల్లో వివిధ భాషల్లో జనం పాటలు, పూనా కళాకారులు హిందీలో మతోన్మాదంపై
వీధి నాటకం, అరుణోదయ బృందం “అప్పుల భారతం” వీధి భాగవతం ప్రదర్శిం
చారు. ఈ కార్యక్రమాన్ని 20 వేల మంది ప్రజానీకం చూశారు.



Edited, Printed and Published by K. RAVI BABU on behalf of JANA SAHITI (A.P.), at Chaitanya Printers, Vijayawada-2. for Co-operative Press, Vijayawada.
Working Editor : NIRMALANANDA

(4వ కవరు పేజీ తరువాయి)

'అతనిదిగో' అని చిన్నారి పిడికిలి తెరచి చూసుకుంది
అతన్ని వెదుక్కుంటూ
వేలాది పక్షులు
ఆదివాసి మెడలో పూసల దండల్లా
వలయాలుగా పయనించాయి-
వెదురు తీగ వొకటి / అతడున్నాడేమోనని
ఘాట్ రోడ్డు దాకా సాగి నిరాశగా వెళ్ళిపోయింది-
అతడు రాలేదు
చలిగోళ్ళు పెంచుకుని క్రూరంగా శిశిరం
చెట్ల ఆకుల్ని రక్కేసి గాల్లో మిగిల్చింది
రాక్షస బల్లి అడుగుల్తో భీకరంగా నడచి వచ్చిన గ్రీష్మం
నేలని నెర్రెలుగా గాయపర్చింది
అతడి జాడలేదు
మళ్ళీ యిన్ని ఋతువుల తర్వాత
[illegible]సిపోయిన ఆకాశం మేఘావృతమైనపుడు
అతడి శరీర పరిమళం
తడిసిన సుగంధమై వ్యాపించింది-
అవ్యక్తమయ్యాడనుకున్న అతడు
నేలపొరల్లో విత్తనమై పరిపక్వమయ్యాడు
విత్తనమై [illegible] విశ్రమించడు
పోరాట రహస్యాల్ని పొదువుకున్న మహారణ్యమూ
పాటా [illegible]
తన మృత్యు వేడుకున్న అతడు
పసుపుతేలిన [illegible] రెమ్మలు ధరించిన వేల మొక్కలుగా
[illegible] గర్వం [illegible]ల్చుకొని వస్తున్నాడు
[illegible] పాత్రల్లో కలల్ని కన్నీళ్ళన్నీ నింపుకుని
అతడిని ఆవాహన చేసుకుందాం
అతడికి మరణం లేదు
(డా॥ [illegible]రెడ్డి మొదటి వర్ధంతి సందర్భంగా)